# రాయలసీమ శెట్టిబలిజలు

## వెనుకబడినవారిలో చేర్చమని విజ్ఞప్తి

కర్నూలు, ఏప్రిల్ 13: విద్యా బోధన, ఉద్యోగ సౌకర్యాల నిమిత్తం రాయలసీమ శెట్టిబలిజ కులస్థులను వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ శ్రీపూసం కోటయ్యనాయుడొక ప్రకటన చేశారు. తమ కులాన్ని వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్పించమని ప్రభుత్వాన్ని కోరుతూ నంద్యాలలో ఈనెల మొదటి తేదీన జరిగిన రాయలసీమ శెట్టిబలిజ మహాసభలో తీర్మానించారు. ప్రభుత్వము, సంక్షేమశాఖ మంత్రి ఈ విషయాన్ని సానుభూతితో పరిశీలిస్తారని ప్రకటనలో శ్రీ నాయుడు ఆశించారు.

## ఉద్యోగవార్తలు

కర్నూలు, ఏప్రిల్ 14: విజయవాడ గ్రామీణ మండల పోలీసు డెప్యూటీ సూపరింటెండెంట్ శ్రీ షేక్ అబ్దుల్ వహీద్ 2 నెలల సెలవు మంజూరైంది.











# పామర్రులో రచయితల సభ

## సన్మానాలు

పామర్రు, ఏప్రిల్ 11: ఆకాశవాణి విజయవాడ కేంద్ర కార్యక్రమాల నిర్వహణ యాజమాన్యం ఏర్పరచిన సలహా సంఘంలో రచయితలకు కూడా స్థానమివ్వాలని కోరుతూ ఈనెల 8వ తేదీ రాత్రి జరిగిన కృష్ణాజిల్లా రచయితల మహాసభలో తీర్మానించారు.

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి అధ్యక్షత వహించారు. శ్రీ కొగంటి దుర్గామల్లికార్జునరావు నివేదిక చదివారు. శ్రీయుతులు కె. వి. కృష్ణారావు, బొడ్డపాటి పూర్ణసుందరరావు, ముక్తేవి శ్రీరంగాచార్యులు, ముక్తేవి ఉదయవర్ ప్రసంగించారు. శ్రీ ఏలూరుపాటి అనంతరామయ్య కావ్యగానం చేశారు. తెలుగులో పారిభాషిక పదాల శబ్దకోశం తయారు చేయాలని ప్రభుత్వానికి, తెలుగుభాషా సమితికి విజ్ఞప్తిచేశారు. పాఠ్యపుస్తకాల నిర్ణయంలో కృష్ణామండల రచయితలసంఘ అభిప్రాయాలు స్వీకరించాలని సూచించారు.

నూతన కార్యవర్గం ఎన్నుకున్నారు. అధ్యక్షుడు: శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఉపాధ్యక్షులు: శ్రీ వేమూరి రామచంద్రరావు, శ్రీ రాంభట్ల వీరబ్రహ్మం, అయ్యంకి వెంకటరమణయ్య, కార్యదర్శులు: కొగంటి దుర్గామల్లికార్జునరావు, ముక్తేవి శ్రీరంగాచార్యులు గారలు, కోశాధికారి: శ్రీ బొడ్డపాటి పూర్ణసుందరరావు, సభ్యులు: పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి, మల్లెల శ్రీరామమూర్తి, అక్కిరాజు గోకర్ణేశ్వరరావు, యం. హనుమంతరావు, కె. వి. కృష్ణారావు.

7వ తేదీ ఉదయం పత్రికల, గ్రంథాల, ప్రదర్శనను శ్రీ కొడాలి ఆంజనేయులు ప్రారంభించారు.

## కవిసన్మానం

ఆ రోజు ఉన్నత పాఠశాలలో శ్రీ కొగంటి దుర్గామల్లికార్జునరావు శ్రీ పి. వి. చలపతిరావులకు సన్మానం జరిగింది. శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ, అధ్యక్షత వహించారు. శ్రీయస్. టి. జి. రాజమన్నార్ ప్రార్థన చేశారు.

శ్రీ వల్లూరిపల్లి లక్ష్మీదాసు సన్మాన పత్రాలు, నూతనవస్త్రాలు రు. 116 సమర్పించారు. శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి, శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు ప్రసంగించారు.

సాయంత్రం ఆనంద కళాసమితి ఆధ్వర్యాన శ్రీ హరిరావుగారికి సన్మానం జరిగింది.

## గ్రంధాలయ సేవకసభ

రాత్రి శ్రీ కరణం రామస్వామి చౌదరి అధ్యక్షతన ఆంధ్రదేశ గ్రంథాలయ సేవకమహాసభ జరిగింది. శ్రీ యస్. వెంకటేశ్వరరావు స్వాగతమిచ్చారు. శ్రీయుతులు మల్లెల శ్రీరామమూర్తి, అయ్యంకి వెంకటరమణయ్య, ప్రభృతి ప్రముఖులు ప్రసంగిస్తూ గ్రంథాలయాల ప్రయోజనాలు పేర్కొన్నారు. శ్రీ మల్లికార్జునరావు వందన మర్పించారు.

శ్రీ సి. నారాయణరెడ్డికి 8వ తేదీ ఉదయం సన్మానం జరిగింది. శ్రీ వడ్డమూడి గోపాలకృష్ణయ్య అధ్యక్షత వహించారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ సభను ప్రారంభించారు. కొండవీటి వెంకటకవి, జి. వి. కృష్ణారావు, చిట్టా బాలకృష్ణశాస్త్రి గారలు మాట్లాడారు. శ్రీ నారాయణరెడ్డికి రు. 116 బహూకరించారు.

సాయంత్రం శ్రీ జి. వి. కృష్ణారావుకు సన్మానం జరిగింది. అర్ధ వేయి నూటపదహార్లు సమర్పించారు. శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి ప్రభృతులు ప్రసంగించారు.

# పుంగనూరు పంచాయతీ

## 11 మంది సభ్యుల ఎన్నిక

పుంగనూరు, ఏప్రిల్ 11: నిన్న ఈ గ్రామ పంచాయతీ ఎన్నికలలో, యీ దిగువవారు ఎన్నికైనారు. శ్రీయుతులు బి. ఆర్. రహీం, పి. లక్ష్మీనారాయణశెట్టి, పి. చెంగారెడ్డి యం. దేవరాజులు, కె. నంజప్ప సామ్యూల్ అంబ్రోస్, కె. కృష్ణమూర్తి రావు, పూలచెంగప్ప, యం. కృష్ణారెడ్డి, సి. శంకరప్ప యస్. అహమ్మద్ హుస్సేన్.

## ఒంగోలులో వేరుసెనగ విక్రయ సౌకర్యం

ఒంగోలు, ఏప్రిలు 8: గుంటూరు మార్కెటింగ్ సంఘం ఆధ్వర్యాన త్వరలో ఇక్కడ వేరుసెనగ క్రయ విక్రయ సౌకర్యాల సంఘాన్ని నెలకొల్పేందుకు ఏర్పాట్లు జరుగుతున్నవని రాష్ట్ర క్రయ విక్రయ సౌకర్యాలశాఖ అధికారి శ్రీసి. అన్నామలై చెప్పారు. వేరుసెనగను వాణిజ్యపంటగా ప్రభుత్వం గుర్తించారని కూడా వివరించారు.

కందుకూరు, ఒంగోలులలో నెయ్యి వాణిజ్యం నిర్ణయ కేంద్రాలను శ్రీ అన్నామలై తనిఖీచేశారు. ఏటేట ముఖ్యంగా కలకత్తాకు కందుకూరు నుంచి 40 వేల విశ్వాల నెయ్యి, ఒంగోలునుంచి 50 వేల విశ్వాల నెయ్యి, గుంటూరునుంచి లక్ష విశ్వాల నెయ్యి ఎగుమతి అవుతున్నదని ఆయన అన్నారు.

# అన్నమాచార్య ఉత్సవాలు

## శ్రీ అనంతకృష్ణ శర్మ గానం

తిరుపతి, ఏప్రిల్ 12: శ్రీ తాళ్ళపాక అన్నమాచార్య ఉత్సవం యీనెల 8 నుంచి 3 రోజులపాటు జరిగింది.

శ్రీ జె. తిమ్మారెడ్డి, స్వాగతమిచ్చారు. గతసంవత్సరపు నివేదిక చదివారు. అన్నమాచార్యుని గీతాలకు ప్రోత్సాహం యిస్తున్నందుకు దేవస్థానాన్ని అభినందించారు.

మంత్రి శ్రీ చంద్రమౌళి అధ్యక్షత వహిస్తూ లలితకళల ప్రాధాన్యం, అందులో ముఖ్యంగా సంగీతానికిగల విశిష్టస్థానం పేర్కొన్నారు. దైవభక్తిని పెంపొందించగల ఉత్తమసంగీతాన్ని అందరూ ఆరాధించాలన్నారు. త్యాగరాజ, పురందరదాసుల కృతులు ప్రజలకు అంత సన్నిహితం కావడానికిగల కారణం యిదేనన్నారు. అన్నమాచార్యుని గీతాల ప్రచారానికి దేవస్థానం చేస్తున్న కృషిని అభినందిస్తూ ప్రభుత్వంకూడా యిందుకు ప్రోత్సాహం యివ్వవచ్చుని అయితే ప్రజలుకూడా సహకరించాలని కోరారు.

శ్రీ అన్నమాచార్యుని కుటుంబ సభ్యులను శ్రీ పి. బాలకృష్ణమూర్తి పరిచయంచేశారు. శ్రీ ఆర్. అనంతకృష్ణశర్మ కొన్ని గీతాలు గానంచేశారు.

నిన్న రాత్రితో ఉత్సవం ముగిసింది. పలువురు గాయకులు కార్యక్రమాలలో పాల్గొన్నారు. విజయవాడ రేడియో కేంద్రం వీటిని ప్రచారం చేసింది.

## విజయనగరంలో రాఘవ నాటకోత్సవం

విజయనగరం, ఏప్రిల్ 13: నాట్య కళాప్రపూర్ణ బళ్లారి టి. రాఘవాచార్యుల స్మారకార్థం, యిక్కడ 16వ తేదీ లగాయతు ఐదు రోజులపాటు టౌన్‌హాలులో నాటకోత్సవాలు ఏర్పాటు చేశారు.

ఉత్సవ ప్రారంభసభకు ప్రదేశ్ కాంగ్రెసు సహాయ కార్యదర్శి శ్రీ పెన్మత్సరాజు వెంకట్రావు అధ్యక్షత వహిస్తారు. ప్రసిద్ధ సినీనటులు శ్రీ ఎ. నాగేశ్వరరావు ప్రారంభిస్తారు. మంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య, బహుమతులు పంచిపెడతారు.

# కోనాయపాలెం ఖూనీ నేరం

## విచారణ ఆపాలని హైకోర్టు ఉత్తర్వు

గుంటూరు, ఏప్రిల్ 12: కోనాయపాలెం ఖూనీ నేరంలో ముద్దాయీలు దాఖలు చేసుకున్న దరఖాస్తుపై, సెషన్సు కోర్టు విచారణ నిలుపు చేస్తూ, హైకోర్టు న్యాయమూర్తి శ్రీ భీమశంకరం నిన్న ఉత్తర్వు జారీచేశారు.

విజయవాడ తాలూకా సబ్ మేజిస్ట్రేటు, ముద్దాయీలను సెషన్సుకోర్టు విచారణకు పంపుతూ ఇచ్చిన తీర్పును రద్దుచేయవలసిందిగా ముద్దాయిలు తమ దరఖాస్తులో కోరారు. ఈ దరఖాస్తు విషయాలను విచారణకు అంగీకరిస్తు, ముద్దాయీలను జామీనుమీద విడుదల చేయాలని, సెషన్సు కోర్టు విచారణ నిలుపాలని న్యాయమూర్తి ఉత్తర్వు చేశారు.

నేరారోపణ వివరాలు: మాచేపల్లి అయిన చెన్నుపల్లి వెంకటస్వామికి, 6 గురు ముద్దాయిలకు రాయుల నాగభూషణం లక్ష్మీనరసు, సూర్యం, వీడుకొండలు, గురవయ్య-విరోధం ఉన్నది. చెన్నుపల్లి వెంకటస్వామి భార్యకు, 1వ ముద్దాయికి అక్రమ సంబంధం ఉన్నది. ముద్దాయిలందరు కలసి, చెనుపల్లి వెంకటస్వామిని అక్టోబరు 15వ తేదీన గ్రామనివార్లలో దారిలో అడ్డగించి, కర్రలతో కొట్టిచంపారు."

విజయవాడ తాలూకా సబ్ మేజిస్ట్రేటు, ప్రాథమికదర్యాప్తు జరిపి ప్రాసిక్యూషన్ తరఫున 24 గురు సాక్షులను విచారించారు. అక్రమంగా కూడి, ఖూనీచేశారనే నేరంపై ముద్దాయిలను, సెషన్సుకోర్టు విచారణకు పంపుతూ, మేజిస్ట్రేటు ఉత్తర్వు చేశారు.

విచారణకోరకు, ముద్దాల తరఫున సాక్షుల జాబితా తెలుసుకోవకుండానే, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ లోని 212వ సెక్షన్ ప్రకారం, తన విచక్షణాధికారం వినియోగిస్తూ, ముద్దాయీలను సెషన్సుకోర్టు విచారణకు పంపే అధికారం చట్టరీత్యా మేజిస్ట్రేటుకు లేదని, మేజిస్ట్రేటు ఉత్తర్వు రద్దుచేయాలని హైకోర్టులో దాఖలు చేసిన దరఖాస్తులో ముద్దాయీలు కోరారు.

ముద్దాయీల తరఫున శ్రీ అడవి రామారావు ప్రభుత్వం తరఫున పబ్లిక్ ప్రాసిక్యూటరు హైకోర్టులో హాజరైనారు.

## చీరాల చేనేత కోపరేటివ్ సంఘం

చీరాల, ఏప్రిల్ 9: శ్రీ అమరా వెంకటేశ్వర్లు అధ్యక్షతన చేనేత కోపరేటివ్ వస్త్రకుల సంఘము పునరుద్ధరింపబడింది. ఈక్రింది వారు కార్యవర్గమునకు సభ్యులుగ ఎన్నికైనారు.

వేముల సుబ్బారావు (ఉపాధ్యక్షులు) నూనె సుబ్బారావు కార్యదర్శి, ఠివవ్రత్తి సుబ్బారావు (సహాయ కార్యదర్శి) గంధి. పేరా ద్రి, యక్కల రామయ్య (కోశాధికారి) మరి 6 గురు సభ్యులు. స్వ. వి.

# పంచాయతీల బ్యాంకు

## స్థాపించాలని తీర్మానం

గుంటూరు, ఏప్రిల్ 11: గ్రామ పంచాయతీల సౌకర్యార్థం పంచాయతీలనుంచి వాటాధనం సేకరించి ఆంధ్రరాష్ట్ర పంచాయతీల సహకార బ్యాంకును నెలకొల్పి దానిద్వారా పంచాయతీలకు అప్పులు ఇచ్చే ఏర్పాటు చేయించవలని ప్రభుత్వాన్ని కోరుతూ గుంటూరుజిల్లా పంచాయతీ అధ్యక్షుల సంఘం తీర్మానించారు.

నేటి మధ్యాహ్నం జరిగిన ఈ సమావేశానికి శ్రీ వడ్డి ముత్యాలరావు అధ్యక్షత వహించారు. స్థానిక పరిపాలనాశాఖమంత్రి డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావు, స్థానిక పరిపాలనాశాఖ ఇన్‌స్పెక్టరు జనరల్ శ్రీ ఎ. రాఘవరెడ్డి కూడా సమావేశానికి వచ్చారు.

రాష్ట్రంలో జరగబోయే ఎన్నికలలో పోటచేసి అనవసర తగాదాలకు అవకాశమిచ్చే పద్ధతికి బదులు సర్వోదయ పద్ధతిలో గ్రామ పెద్దలు, అధ్యక్షులు, సభ్యుల సహకారంతో ఏకగ్రీవంగా ఎన్నికలు జరిపించేందుకు సహకరించమని పంచాయతీ అధ్యక్షులందరికీ విజ్ఞప్తి చేస్తూ ఒక తీర్మానం చేశారు.

ఇతర రాష్ట్రాలలో అమల్లోఉన్న పంచాయతీల పరిపాలనా పద్ధతిని ఆదర్శంగా చేసుకొని మన రాష్ట్రంలో పటిష్టంగా పంచాయతీ పరిపాలన నిర్వహించడానికి వీలుగా చట్టాలను సవరించి, తగు సలహాలు ఇచ్చేందుకు రాష్ట్ర సంఘం సభ్యులు, శాసనసభ సభ్యులతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేయించమని ప్రభుత్వాన్ని కోరారు.

పోరంబోకు భూములు అన్నింటిని క్రమంగా పంచాయతీల అజమాయిషీకి మార్పించమని మరొక తీర్మానంలో ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశారు. 1952-53 సంవత్సరానికి పంచాయతీలకు రావలసిన బకాయీలు అన్నింటిని రద్దుచేయించమని కోరుతూ వేరొక తీర్మానం చేశారు.

పంచాయతీల సభ్యుల పదవీ కాలాన్ని 3 సంవత్సరాలనుంచి 5 సంవత్సరాలకు ఎక్కువ చేయించమని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

పంచాయతీ ప్రాంతాలలో వినోద ప్రదర్శనల పన్ను, అమ్మకం పన్ను వసూలుశాఖ వసూలుచేసి పంచాయతీలకు ఇచ్చే పద్ధతికి బదులు పంచాయతీలే వసూలు చేసుకునే పద్ధతిని అమలు చేయమని ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం చేశారు.

పంచాయతీల పన్నులు సరిగ్గా వసూలు కావడం లేదు. రెవెన్యూ ఫిర్కా కొకరు చొప్పున పంచాయతీలలో పన్నులు వసూలుచేసేందుకు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ హోదాగల ఉద్యోగి ఒకరిని నియమించమని కోరారు.

పంచాయతీలకు కార్యనిర్వహణాధికారులను నియమించే పద్ధతిని రద్దుచేసి జిల్లాబోర్డులకు నియమించినట్టు కార్యదర్శులను నియమించమని, విజ్ఞప్తి చేశారు.

పంచాయతీల పరిపాలనా నిర్వహణశాఖనుంచి లెక్కల శాఖను విడదీసి, పంచాయతీల ఆయవ్యయాలను సరిగ్గా తనిఖీ చేయించేందుకు స్థానిక సంస్థల ఇన్‌స్పెక్టర్ జనరల్ అధ్యక్షతన ప్రత్యేకశాఖను ఏర్పాటు చేయించమని విజ్ఞప్తిచేశారు.

పంచాయతీలకు ఏర్పాటు చేసిన ప్రత్యేక ఇంజనీరింగ్ శాఖ సిబ్బందిని ఎక్కువ చేయమని, భూమిపన్నులో నూటికి రు 12-8-0 పంచాయతీలకు వాటా ఇచ్చేపద్ధతిని రద్దుచేసినందుకు అసమ్మతి తెలియచేశారు. పంచాయతీ ప్రాంతాలలోని చెరువులలోని చేపలను వేలం వేసే హక్కు పంచాయతీలకు ఇప్పించమని అభ్యర్థిస్తూ కూడా తీర్మానించారు.

జిల్లా సంఘానికి ఈ క్రింది కార్యవర్గం ఎన్నికైనారు:

అధ్యక్షుడు-శ్రీ నన్నపనేని నాగయ్య, ఉపాధ్యక్షుడు - శ్రీ ఎ. వీరారెడ్డి, ప్రధాన కార్యదర్శి- శ్రీ ఎ. ధర్మలింగేశ్వరరావు; సహాయ కార్యదర్శి-శ్రీ కె. ప్రసన్నాంజనేయులు, కార్యవర్గ సభ్యులు-శ్రీయుతులు నాగళ్ళ వెంకటరామయ్య, వానిరెడ్డి సుబ్బయ్య, మందపాటి నాగిరెడ్డి, గమిడికోటయ్య, లక్ష్మిశెట్టి వీరభద్రయ్య, బండా సుబ్బారావు, జొన్నల నాగిరెడ్డి, గొల్లపూడి వెంకటసుబ్బయ్య, శ్రీమతి దాసరి శకుంతలమ్మ గారలు.

ఈ సభల సందర్భంలో కుమారి కళాంబి రాజకుమారి భరతనాట్యం చేశారు. ఆహ్వాన సంఘం తరఫున ఆమెకు జిల్లాకలెక్టరు శ్రీ భగవాన్‌దాసు రజితపాత్ర బహూకరించారు. హిందూ కాలేజి విద్యార్థులు "అన్నాని పెళ్ళి" అనే నాటక ప్రదర్శించారు. శ్రీమతి శారదాదేవి జాతీయ గేయాలు పాడారు.

## కోడూరు పంచాయతీ ఎన్నికలు

కడప, ఏప్రిల్ 13: మొన్న 10-వ తేదీన కోడూరు పంచాయతీకి యీ దిగువవారు సభ్యులుగా ఎన్నికైనారు.

1-వ వార్డు: తాలాల జయరామయ్య, దనికి వేణయ్య, 2-వ వార్డు: వుంగరాల జగన్నాథం, ఎస్. పిచ్చయ్య, 3-వ వార్డు: కొమ్మూరు పెద సుబ్బరాయ్య, 4-వ వార్డు: మంచెం గోవిందస్వామి, ఎనమల వెంకటయ్య, 5-వ వార్డు: పులిపల పంచయ్య.

# మిల్లువస్త్రం ఉత్పత్తి

## నిర్బంధిస్తే ధరలు పెరుగుతాయట

అహమ్మదాబాద్, ఏప్రిల్ 14: అహమ్మదాబాద్ మిల్లు యాజమానుల సంఘం అధ్యక్షుడు శ్రీ మదన్ మోహన్ మంగళదాస్ మిల్లు వస్త్రం ఉత్పత్తికి గరిష్ఠ ప్రమాణం నిర్ణయించి నిర్బంధం విధిస్తే, దేశంలో వస్త్రం ఉత్పత్తి తగ్గిపోయి ధరలు పెరిగిపోతాయని హెచ్చరించారు. చేనేత వస్త్రం అనుకున్నంత ఎలాగూ ఉత్పత్తి కావడం అసంభవం అని శ్రీ మంగళదాస్ చెప్పారు. అందువల్ల దేశంలో వస్త్రం ఉత్పత్తి మొత్తం అనుకున్నంత కాదు. వస్త్రం కొరత ఏర్పడి ధరలు పెరిగిపోయే ప్రమాదం ఉందన్నారు. (కార్వే సంఘం మిల్లు వస్త్రం ఉత్పత్తికి 500 కోట్ల గజాలను మించనియ్యకూడదని సిఫార్సు చేసింది).

ధరలు పెరిగితే ఎగుమతి తగ్గిపోతుంది. ఈ యేడాది అప్పుడే ఎగుమతి సన్నగిలిందని శ్రీ మంగళదాస్ చెప్పారు. 1960-61 కి అదనంగా 280 కోట్ల గజాలు వస్త్రాన్ని మిల్లులను ఉత్పత్తి చేయ్యనివ్వాలన్నారు. ఎగుమతిలో విదేశాలతో పోటీకి నిలబడ్డానికి గామిక్కడి మిల్లులు ఆధునిక యంత్రాలు నెలకొల్పుకోడానికీ, ఖర్చులు తగ్గించుకోడానికి వీలివ్వాలన్నారు.

## నూజివీడు పంచాయతీ ఎన్నికలు

### 10 మంది గెలుపు

నూజవీడు, ఏప్రిల్ 9: పట్టణ పంచాయతీ సంఘమునకు ఎన్నికలు ఈనెల 5వ తేదీన జరిగినవి. పోటీ లేకుండ అయావార్డులనుండి ఏకగ్రీవముగా 7వ వార్డునుండి శ్రీ ఎదుకేశి సూర్యనారాయణ, 8వ వార్డునుండి శ్రీ కొండూరుకోటయ్యఎన్నికైనారు. పోటీలో యీ దిగువ అభ్యర్థులు ఎన్నికైనారు.

1వ వార్డు 3 స్థానాలకు: శ్రీ అకుల కాంతారాయుడు, శ్రీ పక్కి రాఘవయ్య, శ్రీ పెనుగొండ నారాయణరావు.

2వ వార్డు 2 స్థానాలు: శ్రీ మద్దిరాల బాలకోటయ్య, శ్రీ పాలెపు వెంకటేశ్వరరావు.

3వ వార్డు 1 స్థానము: శ్రీ బనవాసరపు నరసింహారావు.

4వ వార్డు 2 స్థానాలు: శ్రీ పిల్లిశోభనాచలం, శ్రీ బొబ్బిలి వెంకటరత్నం.

5వ వార్డు 2 స్థానములు: శ్రీ మహబూబ్ అలీషా, శ్రీ లింగాల శోభనాచలపతిరావు.

6వ వార్డు 3 స్థానములు: శ్రీ మేకల రాములు, శ్రీ పిట్టల లక్ష్మీనారాయణ, శ్రీ ఇరవ వెంకటకాశీ విశ్వనాధరావు.

## కొత్తపేట పంచాయితీ ఎన్నికలు

కొత్తపేట, ఏప్రిల్ 10: ఈ గ్రామ పంచాయతీలోని 9 స్థానాలకు, 29 మంది అభ్యర్థి పత్రాలు దాఖలు చేశారు. వారిలో 20 మంది ఉపసంహరించుకోగా, 9 స్థానాలకు 9 మంది ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఎన్నికైన అభ్యర్థులు: శ్రీయుతులు డి. వీరభద్రరావు, శ్రీకొమరిపురాజు, దునబోయిన వెంకటరత్నం, కొసంశెట్టి రమణ, ముత్యాల వెంకటరావు, చేమకూర్ సూరరాజు, బొబ్బిలి మాచారయ్య, సాలాది వీరరాఘవులు, పి. సూర్యారావు.

## టంగుటూరులో అగ్ని ప్రమాదం

ఒంగోలు, ఏప్రిల్ 11: ఇక్కడికి 11 మైళ్ళలోని టంగుటూరు గ్రామంలో క్రితం వారం 21 ఇళ్ళు తగులబడి పోయినవి. ఆస్తినష్టం సుమారు రు 15 వేల దాకా ఉంటుందని అంచనా.

నిరాశ్రయులకు గ్రామస్థులు, వి. ఎల్. టి. డి. కంపెనీవారు సహాయం చేశారు. ఒంగోలు తహసీల్దారు శ్రీ కె. కోటేశ్వరరావు ఆ గ్రామం వెళ్ళి, సహాయానికి అవసరమైన యేర్పాట్లు చేస్తున్నారు.

## కర్నూలు ప్రాంత అభివృద్ధి శాఖ ఉగాది ఉత్సవాలు

కర్నూలు, ఏప్రిల్ 14: కర్నూలు విభాగ జాతీయ వికాస కార్యక్రమ శాఖ ఆధ్వర్యాన గ్రామాలలో ఉగాది ఉత్సవాలు జరిగినవి. ఇంతవరకు జరిగిన అభివృద్ధిపనులను, ఇకముందు జరిగే పనులను వివరించే నినాదాల అట్టలతో ఊరేగింపులు జరిగినవి. గ్రామ పారిశుద్ధ్యం పనులు జరిగినవి. గ్రామస్థులందరు కూడా వీధులను శుభ్రపరచేసి పనిలో సహకరించారు. చిన్నటేకూరు, వోరవకల్లు, పర్ల తదితర గ్రామాలలో ఆటల పోటీలు జరిగినవి. అభివృద్ధిపనులను వివరించమని జిల్లా కలెక్టరు పంపించిన సందేశాలను సభలలో చదివి వినిపించారు. అభివృద్ధి పనులలో సహకరించమని ప్రజలను సభలలో విజ్ఞప్తిచేశారు. వైజ్ఞానిక ప్రదర్శనలు, నాటకాలు కూడా జరిగినవి.

# పబ్లిక్ వర్క్సు శాఖలో అవినీతి

## ప్రజల విజ్ఞప్తుల ఫలితంగా ఉద్యోగులకు హెచ్చరిక

కర్నూలు, ఏప్రిల్ 14: పబ్లిక్ వర్క్సుశాఖ ఉద్యోగులలో అవినీతి విషయమై ప్రజలలో కొందరికిగల అభిప్రాయాలను ఉద్యోగుల దృష్టికి తెస్తూ ఆరోపణలు ఎంతవరకు నిజమో ఎవరికి వారు ఆత్మవిచారణ చేసుకుని అనుమానాలకు అవకాశం మివ్వకుండా ప్రజల సొమ్ము సక్రమంగా వినియోగమయేట్టు చూడమని ఉద్యోగులను కోరుతూ రాష్ట్ర పబ్లిక్ వర్క్సుశాఖ మంత్రి రహస్య సందేశం మొకటి పంపించినట్లు తెలుస్తున్నది.

రహస్య సందేశంలో ఇంకా ఇట్లా ఉన్నదట: "ఎక్కువ డబ్బు ఖర్చుచేసే ప్రభుత్వ శాఖలలో పబ్లిక్ వర్క్సుశాఖ ఒకటని అందరికీ తెలిసినదే. రెండవ పంచవర్ష ప్రణాళిక పనులకు చేసే మొత్తం ఖర్చు రు 125 కోట్లలో నీటి పారుదల సౌకర్యాలకు రు 36 కోట్లు, రోడ్లకు సుమారు రు 575 లక్షలు ఈ శాఖ ఖర్చు పెట్టవలసి ఉన్నది.

"ఇంతేకాక ఇతర శాఖల అభివృద్ధి పనులలోనిర్మాణాలపని కూడా ఈశాఖ ఆధ్వర్యాన నే జరగవలసి ఉన్నది. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో పబ్లిక్ వర్క్సుశాఖ చేయనున్నంత ఖర్చు ఇతరశాఖ ఏదీ చేయబోవడం లేదు. ఈ డబ్బు జాగ్రత్తగా, తెలివిగా వినియోగమై ఖర్చుచేసి ప్రతి దమ్మిడీ వల్ల ప్రజలకు ప్రయోజనం కలిగేట్టు చూడవలసిన బాధ్యత పబ్లిక్ వర్క్సుశాఖకు ఉన్నది. ప్రజల డబ్బు సక్రమంగా వినియోగించవలసిన బాధ్యత ఉద్యోగులకు ఎప్పుడూ ఉంటుంది. అయితే ప్రణాళిక పనులకు పెద్ద పెద్ద మొత్తాలను ఎక్కువ వడ్డీకి అప్పు తెచ్చుకుంటున్నాం. కనుక, కొత్తపన్నులు విధించనున్నాం కనుక అప్పుడు ఈ బాధ్యత మరీ ఎక్కువైంది."

"ఏ కొద్దిమంది ఉద్యోగులో కాక శాఖలోని ప్రతిఉద్యోగి సరయిన దృక్పథం అలవరచుకొని పనిచేస్తే యీ శాఖ తన విధులను సంతృప్తికరంగా నిర్వర్తించగలదు."

"ఈ శాఖ ఉద్యోగుల నైతిక వర్తనపై ప్రజలలో కొంతమందికి ఇప్పుడు గొప్ప అభిప్రాయమేమీ లేదన్న సంగతి ఉద్యోగులకు తెలిసే ఉంటుంది. నిజాయితీకి భిన్నంగా వ్యవహరించే కంట్రాక్టర్లతో ఉద్యోగులు చేతులు కలుపుతున్నారని, దుబారా ఎక్కువ వ్యయం భరించరాని అంచనాలు తయారు చేస్తున్నారని, చేసేపని బాగా ఉండడంలేదని ఇంకా ఇంకా ఏమేమిటో ఆరోపణలు వస్తున్నవి. ఇవన్నీ ఎంతవరకు నిజమో నేను చెప్పను. తమలో తామే ఉద్యోగులే ఆత్మపరిశోధన చేసుకోవాలి. అంతకంటే బాగా నిర్ణయించగలవారెవరూ లేరు."

"సొంత నౌకరు చేయవలసిన పని సరిగ్గా చేయకపోతే ఎంతబాధ కలుగుతుందో ప్రతి ఉద్యోగికి తెలుసుగదా? అటువంటప్పుడు సవ్యంగానో అపసవ్యంగానో మన నౌకరు సరిగ్గా పని చేయనప్పుడు మనం ఫిర్యాదుచేసే మాత్రాన్నే భరింపజేని వ్యవహారాలు సరిగ్గా జరగడంలేదని ఉద్యోగులపై ప్రజలు ఫిర్యాదు చేయడంలో ఆశ్చర్యమేమీ కనిపించదు."

"మన ప్రధానిని, లేదా విదేశాలనుంచి వచ్చే గొప్పవారిని చూడ్డానికని ఈనాడు ప్రజానీకం వస్తున్న పద్ధతిని చూస్తే పందలాది సంవత్సరాలనాటికంటె ఈనాడు ప్రజలలో చైతన్యం ఎంత ఎక్కువైనదీ వివిదితంకాక మానదు. ఇంత శక్తివంతమైన ప్రజాబాహుళ్యానికి విధేయులై చక్కగా పనిచేయని ఉద్యోగులు సుఖపడ్డామని వివిధంగా ఆశించగలరా?"

"ఒక శాఖ శక్తి సామర్థ్యాలు ఆశాఖ అలవాట్లు, సంప్రదాయాలపై ఆధారపడి వుంటవి. ఉద్దేశమేమీ లేకుండానే ఇంతకు పూర్వం ఏర్పడిన అలవాట్లు, సంప్రదాయాలలో కొన్ని ఈనాడు పనికిరాకుండా పోయినవి. చెడ్డ అలవాట్లన్నింటిని మానిసత్సంప్రదాయాలను, మంచి పద్ధతులను నెలకొల్పమని ఉద్యోగులందరికి విజ్ఞప్తి చేస్తున్నాను. ప్రతి ఉద్యోగి అప్పుడప్పుడు కొంత ఆత్మపరిశీలన చేసుకుని స్వయం శిక్షణలవరచుకోవాలనికోరుతున్నాను. శక్తివంచన లేకుండా, చక్కగా, నిజాయితీగా ఉద్యోగ బాధ్యతలను నిర్వర్తించడానికి అనుగుణంగా ప్రతి ఉద్యోగి తన మనస్సుకు శిక్షణ అలవరచాలి. ప్రభుత్వ డబ్బు సక్రమంగా వినియోగమయేట్టు చూడాలి. తన పర్యవేక్షణలోని ఉద్యోగులు నిజాయితీకి భిన్నంగా వ్యవహరించడాన్ని సహించరాదు. అప్పుడప్పుడు ఆత్మపరిశీలన చేసుకోవడంకంటే, మరే విధంగానూ తన విధులను సక్రమంగా నిర్వర్తించగలశక్తి ఉద్యోగికి లభించదు. ఉద్యోగ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించిగే శాశ్వత సుఖం సమకూరుతుంది.

"కొన్ని అనుకరణ దేశాలలో ఉద్యోగులే స్వయంగా కొన్ని ప్రమాణాలను రూపొందించుకున్నారు. అటువంటి బుజువర్తనులైన ఉద్యోగులంటే ఆక్కడి ప్రజలకు చాలా గౌరవం. ఉన్నత నైతిక వర్తన ప్రమాణాలను రూపొందించుకుని అనుసరించే సామర్థ్యం విషయంలో ఆదేశాలవారికి మనదేశంలోని ఉద్యోగులు ఏ విధంగానూ తీసిపోరు. ప్రపంచంలోకల్లా ఉత్కృష్టతమమైన ఆదర్శ మార్గంలో నైతిక వర్తనంగా మనం వ్యవహరించగలమని మనదేశంలోని వివిధ భాషలలోని ఉత్తమగ్రంథాలు విశదం చేస్తున్నవి. ఇప్పుడు మనకు కావలసినది భవిష్యత్తుగాని గతంకాదు. ప్రజల మొదటి స్నేహితులన్న పేరు పబ్లిక్ వర్క్సుశాఖకు, లభించేట్టు ఈ శాఖలోని ప్రతిఉద్యోగి ఇకముందు తన ఉద్యోగవిధులను నిర్వర్తిస్తాడని ఆశిస్తున్నాను."

"మన విధులను సక్రమంగా, నిజాయితీగా చక్కగా నిర్వర్తించి దేశాభ్యున్నతికి తోడ్పడ మిస్తామని ఈ ఉగాదినాడు ప్రతిన పూనుదాము."

## ఆటవస్తువులు బొమ్మలు

### ఎగుమతి కృషి చేయాలని నెహ్రూ హితవు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: భారతదేశంలో తయారవుతున్న ఆటవస్తువులు అందంగాను, చౌకగాను వుంటాయి గనుక విదేశాలకు ఎగుమతిచేసే యత్నం జరగాలనీ, వీటికి విదేశాలలో మంచి గిరాకీ ఉంటుందని నమ్మకంగా ఉన్నదనీ ప్రధాన మంత్రి నేడు లోక్ సభలో అన్నారు.

ఆటవస్తువులు, బొమ్మల పరిశ్రమ అభివృద్ధిపై వచ్చిన ప్రశ్నలకు సమాధానం ఇస్తూ ఉత్పత్తిశాఖ ఉపమంత్రి శ్రీ సతీశ్‌చంద్ర ఈలా అన్నారు: రాష్ట్రప్రభుత్వాలు ఈ పరిశ్రమకు సంబంధించిన కొన్ని పథకాలు తయారుచేశాయి. రెండో ప్రణాళిక కాలంలో ఈ పరిశ్రమ అభివృద్ధి నిమిత్తం రూ 3480 వేలు ఖర్చుపెట్టాలని గూడా అనుకుంటున్నాము."

## చైనాకు సుహృద్భావ బృందం ప్రయాణం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 13: చైనా-భారత సుహృద్భావ సంఘం పంపిన ఆహ్వానాన్ని పురస్కరించుకొని 15 మంది సభ్యులుగల ఒక భారత రాయబార వర్గం, 26వ కలకత్తా నుంచి పెకింగ్‌కు బయలు దేరుతున్నది.

భారత చైనా సుహృద్భావ సంఘ అధ్యక్షుడు సర్దార్ కె. యమ్. పణిక్కర్ యీ రాయబారవర్గానికి నాయకత్వం వహిస్తారు. వీరు 5, 6 వారాలపాటు చైనాలో పర్యటిస్తారు.

## శ్రీశైలంలో ఉగాది ఉత్సవాలు

కర్నూలు, ఏప్రిల్ 13: శ్రీశైలంలో ఉగాది రోజున అమ్మవారి ఉత్సవాలు భక్తి తాత్పర్యాలతో జరిగినవి. పదివేలాది యాత్రికులు వచ్చారు. కర్నూలు జిల్లా దేవాదాయధర్మాదాయ శాఖ అసిస్టెంట్ కమీషనర్, శ్రీశైలం దేవాలయం కార్యనిర్వహణోద్యోగి శ్రీ టి. నరసింహారావు యాత్రికులకు కావలసిన సౌకర్యాల నేర్పాటు చేశారు.

శ్రీశైలం రస్తాకు తారువేసే పని వచ్చే యేడాదికి పూర్తి కాగలదని అధికారులు ఆశిస్తున్నారు. ఆలయ సముద్ధరణ సంఘం కూడా అప్పటికి కొంత పని పూర్తి చేస్తుందని దేవాదాయధర్మాదాయ శాఖ మంత్రి ఆశించు చున్నారు. కృష్ణనుంచి కొండపైకి మంచినీరు సప్లయి చేసేపని పరిశీలన కూడా త్వరలో పూర్తయితే బాగుండునని యాత్రికులు అభిలషిస్తున్నారు.

## కొత్త రాష్ట్రం ఏర్పాటు సన్నాహాలు

కర్నూలు, ఏప్రిల్ 14: ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను కలిపివేసే సందర్భంలో వచ్చే వ్యవహారాల పరిశీలనకు రాష్ట్ర ప్రభుత్వ (అంతర్ రాష్ట్ర వ్యవహారాలశాఖ) ఆధ్వర్యాన కొంతమంది ఉద్యోగులతో ఏర్పాటైన శాఖ కొంతకాలంగా పని చేస్తున్నది.

ప్రస్తుతం ఇందులో మంత్రివర్గ శాఖల ఉద్యోగులుమాత్రమే ఉన్నారు. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుకు సంబంధించిన వ్యవహారాల పరిశీలనకు మొదట ఈ శాఖను ఏర్పాటు చేశారు. అప్పుడు పరిశీలనకు ఇంక మిగిలిన అంశాలను ఈ శాఖ ప్రస్తుతం పరిశీలిస్తున్నది. ప్రస్తుత ప్రధాన కార్యదర్శి శ్రీ వి. కె. రావు హైదరాబాద్ నుంచి తిరిగి రాగానే బహుశా యీ శాఖను ఇంకా విస్తృతం చేస్తారు.

# ఆకాశవాణి

మంగళవారం, ఏప్రిల్ 17

**విజయవాడ**

ఉ॥ 5-50 స్వాగతం 5-55 ప్రసార విశేషాలు 7 తెలుగున వా. 7-15 మద్రాస్ (బి) వలె 7-30 మద్రాస్ వలె 8 ఆంగ్లమున వా.

మ॥ 1 (ఎ) వలె 1-40 హిందీలో వా. 1-50 తెలుగున వా. 2 (బి) వలె. 2-10 హిందీలో కార్యక్రమం.

సా॥ 5-30 ఎస్. పి. భానుమతి 5-45 సంగీతశిక్షణ 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా. 6-15 గ్రామ కార్యక్రమం 7 తెలుగున వా. 7-15 పురాణ కాలక్షేపం 7-30 ఎం. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ ఎన్. సి. హెచ్. కృష్ణమాచార్యులు వయొలిన్ ఎల్లా సోమన్న మృదంగం 8-30 గీత మంజరి (బి) నుంచి 8-45 ఫిలిం గీతాలు (బి) 9 ఆంగ్లమున వా. 9-15 సాహిత్యసంచిక - మహామహోపాధ్యాయ ప్రభాకరశాస్త్రి రచనలు: బి. వి. ఎస్. కృష్ణమూర్తి 9-30 ఎ. పి. ఆర్. వాద్య బృందం 10 ప్రసారసమాప్తి.

**మద్రాస్ (ఎ)**

ఉ॥ 5-50 స్వాగతం 5-55 కార్యక్రమ వివరణ 7 వాద్య సమ్మేళనం 7 15 తమిళ వా. 7-30 డిండిగల్ రత్నం.

మ॥ 12-30 కె. ఆర్. నారాయణస్వామి 1 మహిళామండలి వదన రామాయణము (శ్రీనివాస శిరోమణి) విద్యార్థుల సంఘసేవ: స్థానిక సహకారము (ప్రసంగం) బి. తిమ్మాళ్లాయ్ 1-30 (బి) 1-40 హిందీవా. 1-50 (బి) 2 తమిళ వా. 2-10 నూర్ సుధా-రాధాకృష్ణ (హిందీ ప్రసంగం) మహేశ్ నారాయణసింగ్ 2-30 తమిళ ప్రసంగం 2-40 సారంగి 2-59 తిరుమూర్ లక్ష్మి.

సా॥ 5 హాస్యకథ సంగీతం 5-30 వై. రాజగోపాలన్-వయొలిన్ 6 ప్రాంతీయవా. 6-15 ఎం. ఎస్. సుందరరాజన్ 6-45 చిదంబరం లక్ష్మి 7-15 తమిళవా. 7-30 సంధ్యాగానం (బి) 7-45 బి వలె 9 లలిత గీతావళి 9.15 హిందీ పాఠం 9-30 విజయవాడవలె 10 (బి) 10-30 ప్రసార సమాప్తి.

**మద్రాసు (బి)**

ఉ॥ 6-50 (ఎ) వలె 7 తెలుగున వార్తలు 7-15 ఉదయగానం 7-30 (ఎ) వలె 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 (ఎ) వలె 1 గీతమాలిక 1-30 ఆంగ్లమున వా॥ 1-40 (బి) 1-50 తెలుగున వా॥ 2 గీతమంజరి 2-10 (ఎ) వలె.

సా॥ 5 (ఎ) వలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆంగ్లమున వా॥ 6-05 ప్రాంతీయ వా॥ 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తెలుగున వా॥ 7-15 పురాణ కాలక్షేపం 7-30 తిరుచి వలె 9 ఆంగ్లమున వా॥ 9.15 తమిళ నాటిక 9-30 తిరుచి వలె 10 (ఎ) వలె 10-30 ప్రసార సమాప్తి.

**హైదరాబాద్**

ఉ॥ 5-50 సుప్రభాత్ 5-55 కార్యక్రమ వివరణ 7 తెలుగు వా. 7-15 ఎన్. నాగేశ్వరశాస్త్రి 7-45 కన్నడ వా. 8 ఆంగ్ల వా. 8-15 హిందీ వా. 8-30 ఖయాల్ 8-45 గీత్, ఘజల్.

మ॥ 12-30 (బి) 12-50 మరాఠీ వా. 1 (బి) 1.50 తెలుగు వా.

సా॥ 5-30 ఖయాల్ 5-45 ఘజల్. 6 మరాఠీలో కార్యక్రమం 6-30 (బి) 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ 7 తెలుగు వా. 7-15 గ్రామసీమ నిలవచేయబడిన ధాన్యములకు పట్టేపురుగులు, వాటి నివారణోపాయములు (ప్రసంగం) 7-45 ఘజల్ గీత్ 8 "నేను చెప్పకూడదు గాని...." "నేను చదువుకునే రోజులలో ఎప్పుడూ ఫస్టే" (ప్రసంగం) 8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు 8-20 గీతావళి 8-30 ఇందిరా జయసింహారావు. 9 ఆంగ్ల వా. 9-15 ఉర్దూ వా. 9-30 రిక్షాదాదా (హిందీ నాటిక) తెలుగు మాతృక—చి. కృష్ణమూర్తి అనువాదం—పి. సోమసుందరం 10 ఖయాల్ 10-30 ప్రసార సమాప్తి

## కీ॥ శే॥ శ్రీ జములాపురం సూర్యనారాయణరావు

ఖమ్మం, ఏప్రిల్ 10: శ్రీ జములాపురం సూర్యనారాయణ రావు యెర్రుపాలెంలో గత మాసం 26 సాయంత్రము మరణించారని తెల్పడానికి విచారిస్తున్నాము. వీరు, కాంగ్రెసువాదులు శ్రీ వినోబా భావే ద్వితీయ పాదయాత్రలో రాష్ట్రంలో ప్రప్రథమంగా ఒక గ్రామం దానంచేశారు. మొత్తం ఆరువందల యకరాల భూమిని వీరు దానంచేశారు.

యెర్రుపాలెంలో ఉన్నత పాఠశాల భవన నిర్మాణం నిమిత్తం పదివేల రూపాయలూ, రామచంద్ర ఆంధ్ర భాషా నిలయం అనే గ్రంథాలయానికి ఐదువేల రూపాయలూ, చంద్రమౌళీశ్వర స్వామివారి కల్యాణోత్సవాల శాశ్వత నిధికి పదివేల రూపాయలూ, తమ ప్రథమ ధర్మపత్ని శ్రీమతి శేషమాంబ స్మృతి చిహ్నంగా పురమందిర నిర్మాణానికి పదువేల రూపాయలు విరాళాలుగా ఇచ్చారు. జిల్లా భూదాన సమితి సభ్యులుగా కృషి చేశారు.

వీరి అంత్యక్రియలలో పేదలకు అన్నదానం చేశారు. (స్వ. వి.)

కర్నూలు గోదావరిజిల్లా పనుకబడిన వారిని మహాసభ ... అధ్యక్షతన ... 20వ తేదీన ... మంత్రి శ్రీ గౌతులచ్చన్న ప్రారంభిస్తారు.

## 'అంటార్కిటికాపై సమితి చర్చించాలి'

### భారత ప్రతిపాదన: త్వరలో నివేదిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: అంటార్కిటికా (దక్షిణ ధ్రువ ఖండం) సమస్యను ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశం చర్చించాలని భారతదేశం ప్రతిపాదించినది. ఈవిషయమై త్వరలో నే సమితికి ఒక నివేదికను కూడా సమర్పిస్తుంది.

నేడు లోక్ సభలో విదేశాంగశాఖ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ సాదత్ అలీ ఖాన్ శ్రీ ఎస్. వి. రామస్వామి ప్రశ్నకు జవాబిస్తూ ఈవిషయాలు తెలియజేశారు.

ఈసమస్య ఎప్పుడు చర్చకు వస్తుందని అడగ్గా, అది చెప్పలేమని ప్రధాని నెహ్రూ జవాబిచ్చారు. ఆసమస్యను సమితికి ప్రతిపాదించటంలో తాము ఎవరి హక్కులనూ సవాలు చేయటం లేదనీ, అక్కడ అణ్వస్త్ర పరీక్షలు మొదలైనవి జరిగే ప్రమాదం ఉన్నది గనుక, ఈసమస్యను అరాచకంగా ఎవరికి దొరికింది వాళ్లు ఆక్రమించే పరిస్థితిలో ఉంచటం ప్రమాదకరం గనుక సమితి చర్చకు ప్రతిపాదించామనీ వివరించారు.

అక్కడ ప్రస్తుతం కొన్ని అణుశక్తి పదార్థాలు కూడా దొరుకుతున్న అంతేమే ఇన్ని దేశాలు అక్కడ మూగటానికి కారణమనీ, ప్రతి దేశమూ చిన్నదైనా పెద్దదైనావాటినిసంపాదించాలని ఆశిస్తున్నదనీ భారతదేశం మాత్రం అక్కడ ఏప్రాంతాన్నీ కోరలేదనీ ఆయన వివరించారు.

## లఘుపరిశ్రమల వ్యాప్తి

### కేంద్ర సహాయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 13: లఘుపరిశ్రమలకు సంబంధించిన సాంకేతిక విద్యల్లో శిక్షణ ఇచ్చేందుకుగాను దేశంలో 20 కేంద్రాలను రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో ఏర్పాటుచెయడం జరుగుతుంది అని భారత ప్రభుత్వం నేడు ప్రకటించారు.

ఈ సంవత్సరానికి 4 కేంద్రాలను రాజకోట్, లూథియానా, పాట్నా, తిరుకొచ్చిలలో స్థాపిస్తారు. వీటిల్లో శిక్షణ ఇవ్వడానికి ఫోర్డు సంస్థ 30 మంది సాంకేతిక నిపుణులను పంపిస్తున్నారు.

ఇంతేగాక ఈ రెండో పంచవర్ష ప్రణాళిక కాలంలో సంచార కర్మాగారాలను కూడా అధికం చేస్తారు. ప్రస్తుతం 8 నుంచి వీటిని 24 దాకా పెంచారు.

చిన్న చిన్న కర్మాగారాలలో విద్యుచ్ఛక్తిని ఇతోధికంగా ఉపయోగంలోకి తెచ్చేందుకు కిలోవాట్ యూనిట్ ఒకటికి 0-1-6 చొప్పున ఈ లఘుపరిశ్రమ వారికి సాధ్యమైనచోట్లలో సరఫరా చేయవలసిందిగా కేంద్రం రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదేశాలు అందజేసింది.

వికేంద్రీకరణపద్ధతిలో ఈ పరిశ్రమలను పెంపొందించడానికి ప్రభుత్వం ఈ సంవత్సరంలో 4 కోట్ల రూపాయలదాకా ఖర్చుపెట్ట దలచుకున్నారు. రెండో పంచవర్ష ప్రణాళిక మొత్తం మీద ఇందునిమిత్తం 10 కోట్లు ఖర్చు పెడతారు.

లఘుపరిశ్రమలకు సహాయం చేసేందుకుగాను కేంద్రం రాష్ట్రాలకు 2 కోట్ల రూపాయలు బయానా క్రిందఇచ్చారు.

## కచ్చాథివి భారతదేశందే

### తగాదా ప్రశ్న లేదని శ్రీ నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: ధనుష్కోడికి, తాళెమన్నారుకు మధ్యగా ఉన్న కచ్చాథివి అనే దీవిని గురించి భారతదేశం, సింహళాలు తగాదా పడటం అనే ప్రశ్నే లేదని ప్రధానమంత్రి శ్రీ జవహర్ లాల్ నెహ్రూ నేడు పార్లమెంటులో విశదం చేశారు.

"ఈ దీవి మనదా, వారిదా అని కొంత తగాదా వుంది. సింహళం ఈ విషయమై ఆ మధ్య మనకు వ్రాసింది. మనం జవాబు ఇవ్వటం ఆలస్యమయ్యేటప్పటికి అది తమదేనని భావిస్తూ అంతలా అట్లా ప్రచారం మొదలుపెట్టింది" అని ప్రధాని చెప్పారు.

## నగలపై శ్రీ నెహ్రూ అసహ్యం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: నగలంటే తనకు ఎంత అసహ్యమో శ్రీ నెహ్రూ, యివాళ లోక్ సభలో వెల్లడించారు. కరాచీలోని కాళీ మందిరం నుంచి హైందవభక్తులను భయపెట్టి, గుండాలు నగలు ఎత్తుకొనిపోయినమాట నిజమేనా అని శ్రీగాడిలింగనగౌడ్ ప్రశ్నించగా శ్రీ నెహ్రూ యీ సమాధానం యిచ్చారు.

శ్రీ నెహ్రూ:- నాకా విషయం ఏమీ తెలియదు. నగలసంగతి నేనేమీ వినలేదు. నాకవి అంటే ఆసక్తిలేదు. నగలకు ఆరాధకుడు కాస్తా నేమిటో కూడా నాకు తెలియదు. అయితే ఎవరి నగలు యింకొకరు ఎత్తుకొని పోకూడదనుకోండి. అది వేరే విషయం. నగలుంటే, వాటిని తీసుకొని సముద్రంలో పారేయడం మంచిది."

## పాక్ సరిహద్దు సంఘటనలు

### భారత సైన్యానికి ఆయుధాలు కైవసం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: ఇటీవల హుసేన్ వాలా (పంజాబ్) దగ్గరా, ఇతరచోట్లా జరిగిన సరిహద్దు సంఘటనల్లో భారత సైన్యాలు తమపై దాడి చేసిన పాకిస్తాన్ సేనల దగ్గర అనేక ఆయుధాలనూ, మందుగుండు సామగ్రినీ పట్టుకున్నవని ప్రధాని నెహ్రూ నేడు లోక్ సభలో ప్రశ్నలకు జవాబిస్తూ వెల్లడించారు. పట్టుబడిన ఆయుధాలలో బ్రెన్ గన్ లు, స్టెన్ గన్ లు, రైఫిల్ లు, గ్రెనేడ్ లు ఉన్నవని ఆయన వివరించారు, అవి అమెరికన్ ఆయుధాలు మాత్రం కావని అన్నారు.

అవి ఏ దేశంలో తయారయినవి అని అడగ్గా, దానిని గురించి తెలియదని ప్రధాని జవాబిచ్చారు.

## అణ్వస్త్రాల పరీక్షలు స్వదేశాల్లో జరగరాదట

అణ్వస్త్ర పరీక్షలు స్వదేశాల్లో జరగరాదని కొన్ని దేశాలు చేస్తున్న వాదాన్ని తాను హర్షించలేనని ప్రధాని నెహ్రూ శ్రీ సి. ఎన్. మాలవియా ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించారు.

ప్రశ్న:- అణ్వస్త్ర పరీక్షలను ఆపవలసిందని రష్యా బ్రిటన్ లకు ప్రధాని చేసిన విజ్ఞప్తి ఎంతవరకు పాటించబడ్డది?

ప్రధాని:- ఉభయదేశాలు పరీక్షలను అప్పుడప్పుడు జరుపుతునే ఉన్నవి. అయితే రష్యామాత్రం ఇతర దేశాలు కూడా ఆపేందుకు అంగీకరిస్తే, తాను ఆ పరీక్షలను ఆపటానికి సిద్ధమని ప్రకటించి ఉన్నది.

ప్రశ్న:- అమెరికా కూడా అటువంటి ప్రకటన చెయలేదా?

ప్రధాని:- అట్లా చేసినట్టు నాకుగుర్తు లేదు.

ప్రశ్న:- బికినీలో అమెరికా ఉదజని బాంబు పరీక్షలను జరిపినప్పుడు కొన్ని భారత విమానాలమీద అణుకిరణాలను ప్రసరింప జేసున్న ధూళిపడ్డది కదా! ఈ నెల 20 వ తేదీ నుంచి అమెరికా మార్షల్ దీవుల్లో మళ్ళీ జరిపే పరీక్షల సందర్భంలో ప్రభుత్వం ఏమయినా జాగ్రత్త తీసుకుంటున్నదా?

ప్రధాని: మనం తీసుకోగలిగిన జాగ్రత్తలేమిటో నాకు తెలియదు.

ప్రశ్న: జరగబోయే పరీక్షబలాన్ని గురించీ, తీసుకునే జాగ్రత్తలనుగురించీ, అమెరికా ప్రతినిధి ధర్మకర్తృత్వ మండలికి తెలియజేశారా?

ప్రధాని: చేశారు. ఇదిమామూలుగా జరుగుతు నే ఉంటుంది. అసలు ఈ విషయాన్ని (ధర్మకర్తృత్వ ప్రాంతాల్లో అణ్వస్త్ర పరీక్షలు జరపటాన్ని) అంతర్జాతీయ న్యాయస్థానానికి ప్రతిపాదించాలని భారతదేశం ప్రతిపాదించింది. కాని అది వీగిపోయింది. ధర్మకర్తృత్వ ప్రాంతాలను ప్రపంచానికి మేలుకలిగేట్లు పాలించమని అప్పగించటం జరగ్గా, ఆ ప్రాంతాల ప్రజలకు అపాయంకలిగేపద్ధతిలో ఇది జరుగుతున్నది.

## మార్షల్ దీవుల ప్రజలకోరిక

విదేశాంగ పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ సాదత్ అలీఖాన్ ఈ విధంగా వివరించారు.

మార్షల్ దీవుల ప్రజలు ధర్మకర్తృత్వ మండలికి పెట్టుకున్న మహజరులో రెండు కోర్కెలు కోరారు - (1) ప్రాణాంతకమయిన ఆయుధ పరీక్షలన్నీ తక్షణం ఆపివేయాలి. (2) అవి తప్పనిసరి అయితే రక్షణ జాగ్రత్తలు తీసుకోవాలి. ధర్మకర్తృత్వ మండలి జాగ్రత్తలు తీసుకోవాలని తీర్మానించింది. ఆ తీర్మానాన్ని భారతదేశం ప్రతిఘటించింది."

## సింగపూర్ లో ఐ. ఎన్. ఏ. స్మారకం

సింగపూర్ లో ఆజాద్ హింద్ ఫౌజ్ స్మారక చిహ్నాన్ని నిర్మించే విషయమై భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నదని ప్రధాని నెహ్రూ శ్రీ కామత్ ప్రశ్నకు జవాబిస్తూ వెల్లడించారు.

భారతదేశం దీనికి అనుమతి కోరితే సింగపూర్ ప్రభుత్వం సానుభూతితో గమనిస్తుందని ముఖ్యమంత్రి శ్రీ మార్షల్ ఇటీవల ప్రకటించి ఉన్నారు.

## కేంద్ర ఉద్యోగ వర్గంలో ఖాళీలు

అలహాబాద్, ఏప్రిల్ 13: కేంద్ర ప్రభుత్వం ప్రస్తుతం ఐ. ఏ. ఎస్ లో ఉన్న ఖాళీలలో వాటిని కొంతమేర ఉద్యోగాలను రాష్ట్ర సివిల్ శాఖ నుంచి (పి. సి. ఎస్.) ఉద్యోగుల సహాయాను పెంచటంద్వారా భర్తీచేయటానికి నిశ్చయించినట్లు తెలుస్తున్నది.

ఈ ఆశ్వవసర చర్యకు సంబంధించిన నిబంధనలను కేంద్ర ప్రభుత్వం రెండుమూసాల్లో పూర్తిచేస్తుంది.

## పాకిస్తాన్ కు చైనా బొగ్గు

ఢాకా, ఏప్రిల్ 13: బొగ్గు కొరతవల్ల తూర్పు పాకిస్తాన్ ఎదుర్కొంటున్న విషమ పరిస్థితి నుంచి తప్పించేందుకు పాకిస్తాన్, చైనా నుంచి లక్ష 60 వేల టన్నుల బొగ్గును దిగుమతి చేసుకుంటున్నది.

భారత దేశపు బొగ్గుకంటే చైనా సరుకు చవుకైనదని తెలుస్తున్నది.

ఆంధ్రరాష్ట్ర క్షయ నివారక సంఘం కర్నూలులో ఏప్రిల్ 7 న సమావేశమైనది.

నర్సరావుపేట తాలూకా ములికిపూడి గ్రామంలో శ్రీమతి కందిమళ్ల శారదాంబ బోర్డు ఉన్నత పాఠశాల పంచమ వార్షికోత్సవం గ్రామ పంచాయితీ అధ్యక్షులు శ్రీ కందిమళ్ల తిరుపతిరాయుడు అధ్యక్షతన జరిగింది. శ్రీ లచ్చన్నకు స్వాగతపత్రం సమర్పించారు.

శ్రీ ధనళాయా ఫిలింస్ వారి కొత్త చిత్రం 'భలే బావ'కు ఇటీవల వీనస్ స్టుడియోలో ప్రారంభోత్సవం జరిగింది. నిర్మాత శ్రీ టి. రామయ్య. శెలంగి, చంద్రశేఖర్, దర్శకుడు రజనీకాంత్ లు ఈచిత్రంలో ఉన్నారు.

## కాశ్మీర్ పాకిస్తాన్ లో చేరితే హాని

### మద్రాసు ముస్లిం నాయకుని హెచ్చరిక

మద్రాసు, ఏప్రిల్ 12: మద్రాసు శాసనసభ సభ్యులూ, పూర్వ గవర్నరూ అయిన శ్రీ మహమద్ ఉస్మాన్ కాశ్మీరు జనవాక్య సేకరణ సందర్భంలో భారతదేశంలోని ముస్లిములందరూ భారత ప్రధానినే సమర్థించాలని విజ్ఞప్తి చేశారు. జనవాక్యం అంటే జూదంవంటిది. మతావేశాలను రెచ్చగొట్టితే వానిని బట్టి కాశ్మీరు పాకిస్తాన్ లో చేరే దురదృష్టమే ప్రాప్తిస్తే, అదిభారతదేశంలో హిందువులకు ముస్లిములకు మధ్య వైరాలకు కారణ మౌతుంది. భారతదేశంలో ముస్లిములు తమ క్షేమంకోసమే ఈదుర్ఘటనను నివారించాలి. జనవాక్యసేకరణ తప్ప మరో శాంతియుతమైన మార్గాన్ని భారత పాకిస్తాన్ ప్రధానులు కనిపెట్టాలి.

ఉభయ దేశాలమధ్య సుహృద్భావం ఉండడమే ఇక్కడ ముస్లిములకు క్షేమం. ఇందుకోసం 1. సరిహద్దులను నిర్ణయించి, 2. తూర్పు పాకిస్తాన్ లో హిందువులకు భద్రత చేకూర్చి వలసలని ఆపి, 3 పాకిస్తాన్ పత్రికలు భారతదేశంపై విషప్రచారాన్ని మానాలి అని శ్రీ ఉస్మాన్ అన్నారు.

## 9 మంది కార్మికుల జీవ సమాధి

అహమ్మదాబాద్, ఏప్రిల్ 13: సబర్మతి సమీపంలో ఒక మట్టి దిబ్బ కూలి పడటం వల్ల 9 మంది కార్మికులు జీవ సమాధి అయ్యారు. వీరిలో యిద్దరు బాలికలు కూడా ఉన్నారు.

ఇవరిలెంటి మాత్రే ప్రస్తన్నది. అన్నం తిని కొసేప్పు చల్లగా విశ్రమించాలని పాపం వీరు బాగా త్రవ్విన మట్టిదిబ్బకిందికి పోయారు. ఇంతలో ఆ దిబ్బ కాస్తా విరుచుకుపడి వీరిని జీవ సమాధి చేసేసింది.

## మంచినీళ్లగ్లాసులో మృష్టాన్నం

ఫ్రాంక్ ఫర్టు, ఏప్రిల్ 10: బాగా ఆకలిగా ఉన్నప్పుడు, ఒక కొత్తరకం ఆహార ద్రావకాన్ని సేవించేటట్లయితే కడుపు నిండినట్లు తృప్తిపడతారు. ఈ మందును ఇక్కడ ఒక వైద్యులసభలో ప్రదర్శించారు.

"ఇదిన్నీ మంచినీళ్ల గ్లాసులో మృష్టాన్నం" అని, అభివర్ణించారు. ఈ ఆహారాన్ని ఆల్ గే (సముద్రపు కలుపుమొక్కలు) నుంచి తయారు చేస్తారు. ఈ చూర్ణం నీటిలో కరిగిపోతుంది. రుచికి లెమనేడ్ లాగా ఉంటుంది."

## ఇంటి బెంగ ఉన్న రామచిలుక

డబ్లిన్, ఏప్రిల్ 11: జోనాథన్ జైలి అనే వ్యక్తికి చెందిన "కీటో" అనే అద్భుతమైనరామచిలుక వారంరోజులు నాడు పంజరంనుంచి పారిపోయింది. కొన్నాళ్ళు విచ్చలవిడిగా తిరిగి తరవాత దానికి యింటిమీద బెంగపుట్టి, ఒక కొత్త గృహంలో దూరింది. తన యజమానుల యింటికి యీ యిల్లు అనేక మైళ్లదూరంలో ఉన్నది.

ఈ కొత్త యింటి వారికి తన ఎరుక చెప్పకొని జైలీ యింటి టెలీఫోన్ నంబరు చెప్పింది.

తరవాత శ్రీమతి జైలీ వచ్చి రామచిలుకనుతీసుకొనిపోయింది. ఒక వేళ తప్పిపోయే పక్షంలో తన పేరు (కీటో) ఫోన్ నంబరు చెప్పగలిగేటట్లు గంటలకొద్దీ ఈ చిలుకకు శిక్షణ యిచ్చానని తెలియజేసింది.

## సికింద్రాబాదు ఎన్నికల సంఘం

సికింద్రాబాదు, ఏప్రిల్ 13: సికింద్రాబాదుజిల్లా కాంగ్రెసు సమితి సర్వసభ్య సమావేశం నిన్న ధాన్యం వర్తకుల ధర్మశాలలో సమావేశమై నగర ఎన్నికల సంఘం సభ్యులను ఎన్నుకున్నది. జిల్లా సమితి అధ్యక్షుడు శ్రీ వి. వి. గురుమూర్తి అధ్యక్షత వహించారు. సభ్యులుగా ఈ క్రింది వారు ఎన్నికైనారు: శ్రీయుతులు బి. ఆర్. లక్ష్మయ్య, శ్రీ డి. రామలాల్, జె. వి. ముత్యాలరావు, వి. రంగస్వామి, ఉప్పు నారాయణ, ఎం. రామచంద్రయ్య, దీనికి శ్రీ వి. వి. గురుమూర్తి అధ్యక్షుడుగాను, శ్రీ కె. యస్. మూర్తి సమావేశకర్తగాను వ్యవహరిస్తారు.

ఈ ఎన్నికలు ప్రదేశ కాంగ్రెసు ఎన్నికల అధికారి శ్రీ మాకలపల్లి త్రిమురక్షే సమక్షంలో జరిగినవి.

## బ్రిటిష్ బిరుదులకు శ్రీలంక స్వస్తి

కొలంబో, ఏప్రిల్ 14: ఇకముందు బ్రిటిష్ రాజరిక బిరుదాలను శ్రీలంక (సింహళ) పౌరులకుఇవ్వవద్దని బ్రిటిష్ రాణిని కోరాలని శ్రీలంక ప్రభుత్వం ఇవాళ నిర్ణయించింది.

సింహళం పార్లమెంటు భవనం వద్దా, శాసనసభ్యుల వసతిభవనం 'శ్రావస్తి'లోనూ మద్యశాలల్ని తొలగించాలని కూడా ప్రభుత్వం నిర్ణయించింది.

శ్రీలంక నూతన మంత్రివర్గం ఇవాళ మొదటి సారిగా సమావేశమైంది.

శ్రీలంక నూతన ప్రధాని బండారనాయకెకు భారత ప్రధాని శ్రీ నెహ్రూ, జపాన్ ప్రధాని శుభసందేశాలు పంపారు.

## భారత రష్యాదేశాల మధ్య నౌకాయానం

పారిస్, ఏప్రిల్ 14: రష్యా భారతదేశాలమధ్య కొత్తగా నౌకాయానం ఆరంభం అయిందనీ, దీనికి నాందీగా సోవియట్ నౌక నిన్న ఒడెస్సానుంచి బొంబాయికి బయలుదేరిందనీ మాస్కో రేడియో వెల్లడించింది. ఈ ఓడలో యంత్రాలు, లోహాలు, కాగితం యింకా భారతదేశానికి అవసరమైన యితర పారిశ్రామిక వ్యవసాయ పరికరాలు ఉన్నాయి.

## మధ్య ప్రాంతంలో పొగ తోటలకు ఎరువులు

### ఇంకా ఎక్కువ సప్లయి చేయించమని అభ్యర్థన

భద్రాచలం, ఏప్రిల్ 10: పొటాష్ ఎరువు బాగా సప్లయికాక పోతున్నందున, తెగుళ్ళవల్ల మధ్యప్రాంతంలో పొగాకుపంట తగ్గి పోతున్నదని ఆంధ్రరాష్ట్ర క్రయ విక్రయ సౌకర్యాలశాఖ అధికారి శ్రీ సి. అన్నామలైకి మధ్యప్రాంత పొగాకు ఉత్పత్తిదారులు వివరించారు. పొటాష్ ఎరువులను వ్యవసాయశాఖద్వారా మరి మే సప్లయి చేయించమని అభ్యర్థించారు. గుంటూరు పొగాకు ఉత్పత్తిదారుల సౌకర్యశాఖాధికారి శ్రీ ఎమ్. శ్రీనివాసరావు, వ్యవసాయశాఖ ఉద్యోగి శ్రీ వి. సుబ్రహ్మణ్యం మొదలైనవారు వెంటరా శ్రీ సి. అన్నామలై మధ్యప్రాంతంలో పర్యటించి నరసాపురం, దర్ల ప్రాంతాలలో బీడీలకు పనికివచ్చే పొగాకు పండించే శ్రీయుతులు నరహరి, బసవ పున్నయ్య మొదలైన వారిని కలుసుకొని మాట్లాడారు. ఈ ప్రాంతంలో పండిన పొగాకులో నాటికి 35 వంతులకంటే ఎక్కువే అమ్మకమై పోయింది. కిందటేడు ధరలే వచ్చినవని ఉత్పత్తిదారులు ఆయనకు వివరించారు.

తిరతమ చేదాకేమీ లేకుండా పొగాకుకు సక్రమమైన ధర ఉత్పత్తిదారుకు రావడానికి వీలుగా వ్యవసాయోత్పత్తుల క్రయ విక్రయ సౌకర్యాల సంఘంద్వారా పరుసు చేయించడానికి పొగాకు "గ్రేడియింగ్" యంత్రాన్ని ఇక్కడ నెలకొల్పించమని ఉత్పత్తిదారులు శ్రీ అన్నామలైను అభ్యర్థించారు.

కొవాలని కొనుగోలుదారులు కిందటేడు కంటే పొగాకుకు తక్కువ ధర ఇస్తున్నారని ఉత్పత్తిదారులు-అదేమీ లేదు కిందటేడు ధరలకే అంతకంటే ఎక్కువ పొగాకు ఈ ఏడు కొన్నామని కొనుగోలుదారులు అంటున్నారు. అందుకని పొగాకు కొనుగోలుదార్లు సక్రమమైన ధర యిచ్చే విషయమై తోడ్పడేందుకు ప్రధాన కేంద్రాల్లో ఉద్యోగులను నియమించాలనిప్రభుత్వం నిర్ణయించారు. గిట్టుబాటైన ధర ఇవ్వమని కొనుగోలుదార్లకు ఉద్యోగులు ఆయా కేంద్రాల్లో విజ్ఞప్తిచేస్తారు. అంటే ఉత్పత్తిదారులకు, కొనుగోలుదార్లకు మధ్య సమాధ్యత నెలకొల్పే ఉద్యోగులుగా వ్యవహరించారు. గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో ఇటువంటి ఉద్యోగులను నియమించారు. వారి పనిని స్వయంగా చూచేందుకు శ్రీ అన్నామలై, శ్రీనివాసరావుగారలు ఇప్పుడు ఈ ప్రాంతానికి వచ్చారు.

### ఒంగోలుకు రాక

ఒంగోలు, ఏప్రిలు 8: పొగాకు ఉత్పత్తిదారులకు మంచిధరలు వచ్చేట్టు చూచేందుకు ముఖ్యమైన కేంద్రాలలో ప్రభుత్వం ఉద్యోగులను నియమించారని ఆంధ్రరాష్ట్ర క్రయవిక్రయసౌకర్యాలశాఖ అధికారి శ్రీ సి. అన్నామలై ఇక్కడ చెప్పారు.

గుంటూరు పొగాకుశాఖాధికారి శ్రీ ఎం. శ్రీనివాసరావు, క్రయవిక్రయ సౌకర్యాలశాఖ సహాయోద్యోగి శ్రీ పి. శేషాద్రిశెర్మ, జిల్లా వ్యవసాయశాఖాధికారి శ్రీ వి. కుమారస్వామి, పొగాకు మార్కెటింగ్ సంఘ కార్యదర్శి శ్రీ ఎం. వెంకటేశ్వర్లు వెంటరా శ్రీ అన్నామలై టంగుటూరు,కందుకూరు త్రోవగుంట కేంద్రాలను చూచారు.

రైతులు పండించే పొగాకుకు సరైన ధర ఇప్పించేందుకు ప్రభుత్వం ఇట్లా ఉద్యోగులను నియమించినందునపొగాకుధర పెరిగింది. ఈ అవకాశాన్ని వినియోగించుకుని సరైన పద్ధతుల్లో పొగాకు పండించే పద్ధతులను రైతులకు వ్యవసాయశాఖ ఉద్యోగులు తెలియచెబుతున్నారు.

ప్రభుత్వం నియమించిన ఉద్యోగులు ఏవిధంగా పనిచేస్తున్నదీ శ్రీ అన్నామలై అజమాయిషీ చేశారు.

గుంటూరులో ఐ. ఎల్. టి. డి. కంపెనీ ప్రతినిధులు శ్రీ బ్రాక్, పి. బి. మూర్తిగారలను, బి. ఐ. టి. కంపెనీ ప్రతినిధి శ్రీ డి. ఎస్. మూర్తిని శ్రీ ఎ. ఎస్. కృష్ణమూర్తి మొదలైనవారిని శ్రీ అన్నామలై కలుసుకొని మాట్లాడారు.

## భద్రాచలంలో క్రయ విక్రయ సౌకర్యాలం

భద్రాచలం, ఏప్రిల్ 10: తూర్పుగోదావరిజిల్లా మార్కెటింగ్ సంఘం అధ్వర్యాన భద్రాచలంలో పొగాకు క్రయవిక్రయ సౌకర్యాల కేంద్రాన్ని నెలకొల్పారని తెలుస్తున్నది. ఇటువంటి సంఘంలోపాటు, పొగాకు "గ్రేడియింగ్" కేంద్రాన్ని కూడా ఏర్పాటుచేస్తే తప్ప రైతులకు అంత ప్రయోజనకరంగా ఉండదు.

మధ్య ప్రాంత భూమిలో పొటాష్ తక్కువ. అందువలన వ్యవసాయ శాఖద్వారా ఈప్రాంతంలోని పొగాకు ఉత్పత్తి దారులకు పొటాష్ ఎరువును సప్లయి చేయించే సంకల్పం కూడా ప్రభుత్వానికి ఉన్నదట.

## కరాచీలో ధ్వంసం చేసిన కాళీ ఆలయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: గత సంవత్సరం జూలైలో పూర్తిగా పడగొట్టిన కరాచీలోని కాళీ మందిరాన్ని పునర్నిర్మించవలసిందిగా పాక్ అల్ప సంఖ్యాక వర్గాలమంత్రి ఆదేశించినట్లు నేడు లోక్ సభలో శ్రీ సాదత్ అలీ ఖాన్ తెలియచేశారు. భారత హైకమిషనరు శోక్యం చేసుకున్న మీదట ఈ ఆదేశం యివ్వడం జరిగిందని తెలిపారు.

ఈ ఆలయాన్ని, ఫిబ్రవరి 19 న తెరిచారు గాని పూజలింకా ప్రారంభం కాలేదని, కొన్ని మరమ్మతులింకా అవసరమని చెప్పారు. దీని నిర్వహణ విషయమై ప్రభుత్వంతో హిందూ పంచాయత్ వారు సంప్రతిస్తున్నారు.

## సిబ్బందికి చేనేత దుస్తులు

### చీరాల పురపాలక సంఘ నిర్ణయం

చీరాల, ఏప్రిల్ 9: పురపాలక సంఘం శ్రీ రావుల శారిప్రసాదరావు అధ్యక్షతన సమావేశమై అన్ని శాఖలలోని తక్కువశ్రేణిలోని పురుషులకు చేనేతవస్త్రాలతో తయారయిన కోట్లు, టోపీలు (చెప్పులతోసహా ఒక్కొక్కరికి ఒకజత), స్త్రీలకు చేనేత చీరలు రవికెలు (వొక్కొక్కరికి వొక జత) సప్లయిచేయాలని తీర్మానించారు. వీధి వాటకశాలకు విద్యుద్దీపాలు అమర్చడానికి ఇతర వరం జా మా రు రు 5000 మంజూరుచేశారు. (స్వ. వి.)

## మంత్రుల కార్యక్రమం

కర్నూలు, ఏప్రిల్ 14: సహకార శాఖ మంత్రి శ్రీ డి. సంజీవయ్య ఈ నెల 19 వ తారీకు రాత్రి 20 వ తేదీన అక్కడినుంచి విజయనగరం వెళ్తారు. విజయనగరం వాణిజ్యమండలి 8 వ వార్షికోత్సవ సభకు 21 ప్రారంభోత్సవం చేస్తారు. సాలిపుగ్గ జాగవిల్లు పనివారి సంఘం రజతోత్సవంలో పాల్గొని 23వ తేదీన రాత్రేరు నుంచి బయలుదేరి కర్నూలుకు తిరిగి వస్తారు.

రెవెన్యూ మంత్రి శ్రీ కె. చంద్రమౌళి ఈ నెల 22 న తెనాలివెళ్ళుతారు. 28 న మద్రాసు వెళ్ళి 25 న ఇక్కడికి వస్తారు.



# విజ్ఞానాభివృద్ధిలో వెనుకపడిపోకూడదు

## ఉద్యోగులూ శాస్త్రజ్ఞులూ కాలంతో పాటు మారాలని శ్రీ నెహ్రూ ఉద్బోధ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: శాస్త్ర విజ్ఞానంలో అతి వేగంగా వృద్ధి, పరిణామాలు చెందుతున్న ఈ ప్రపంచంలో మనల్ని ఎదుర్కొంటున్న బ్రహ్మాండమైన సమస్యల్ని పరిష్కరించగలగడానికి దేశంలోని యువజనం సంకల్పబలం, ఊహాశక్తి, విశిష్ట ప్రజ్ఞ అలవర్చుకోవాలని ప్రధాని శ్రీ నెహ్రూ విశ్వవిద్యాలయ ప్రణాళికా సదస్సు ప్రారంభోత్సవం జరుపుతూ బోధించారు.

"ఇది శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక విజ్ఞానాలయుగం. అతి వేగంతో విజ్ఞానశాస్త్రం వృద్ధి పరిణామాలు చెందుతున్న ఈ యుగంలో మనం వెనుకబడిపోతామేమోనని నాకు అప్పుడప్పుడు భయం కలుగుతూ ఉంటుంది. మీరు మీ మేధాశక్తిని పదును పెట్టి నేటి సమస్యల పరిష్కారానికి సిద్ధపడాలి" అని శ్రీ నెహ్రూ ఈ సదస్సుకు వచ్చిన అధ్యాపకులు విద్యార్థులకు బోధించారు. 14 రాష్ట్రాలలో 65 కళాశాలలకు చెందిన విద్యార్థులు, అధ్యాపకులు మొత్తం 180 మంది ఈ సదస్సుకు వచ్చారు. ప్రారంభోత్సవానికి వచ్చినవారిలో ప్రణాళికా మంత్రి శ్రీ నందా, ఆర్థికమంత్రి శ్రీ దేశ్‌ముఖ్, శ్రీ వి. టి. కృష్ణమాచారి, శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ కూడా ఉన్నారు.

సామ్యవాద స్థాపన భారతదేశ లక్ష్యం అని శ్రీ నెహ్రూ చెప్పారు. అయితే సామ్యవాదం సామ్యవాదం అన్నంతలో అది రాదన్నారు. ఇతర దేశాలను అనుకరించకూడదన్నారు. ఇతరదేశాల అనుభవంవల్ల కొన్ని మాత్రం నేర్చుకోవచ్చును.

ప్రణాళికా విధానం కుశలమైన నిర్వహణ ఉంటే కాని కార్యక్రమాలు నెరవేరవు. నిన్నటి ప్రభుత్వోద్యోగి ఇవాళ పనికిరాడు. ఈనాడు పరిపాలనావ్యవస్థలో అతడికి ప్రత్యేకజ్ఞానము, శిక్షణ అవసరమౌతున్నాయి.

విద్యార్థులకు దేశాభివృద్ధి కార్యక్రమాలతో ఎలాటి సంబంధం లేకుండా పోతుందని కొందరి భావం. ఆ అపోహను తొలగించడానికి ఈ సదస్సు ఏర్పాటయిందని శ్రీ నెహ్రూ చెప్పారు.

విద్యార్థులకు సంబంధించినంతవరకూ ఏ విషయమైనా సరే అయితే గుసగుసలలో మునిగిపోతుంది, లేదా కుండ బద్దలు కొట్టినట్టు ఒక్కసారి పెద్ద ధ్వనితో బద్దలైపోతుంది. ఇది చాలా చిత్రంగా ఉందని శ్రీ నెహ్రూ అన్నారు.

అసలు విద్యార్థులంటే అదో ప్రత్యేక కులంలాగా పరిగణించడం ఎందుకో అర్థం కావడం లేదన్నారు. విద్యార్థుల్లోనూ మంచివాళ్లూ ఉన్నారు, చెడ్డవాళ్లూ ఉన్నారు. అంతే కాని అందరికీ ఒక లక్షణం అంటగట్టడం మంచిది కాదు. విద్యార్థులంటే వారిలో అంతశ్శక్తి అపారంగా ఉంది. దాన్ని వినియోగానికి తీసుకురావాలి. అందువల్ల విద్యార్థుల్ని సమాజంగా మనుష్యుల్లాగే చూడాలి కాని విలక్షణమైన జాతిగా పరిగణించకూడదు.

ఏ దేశం నినాదాలతో గొప్పది కాలేదని శ్రీ నెహ్రూ అన్నారు. ఆడంబరం, దర్పం వదలించి ఏ దేశమూ ఇంతవరకూ యుద్ధాలు కూడా గెలవలేదు. ఏ దేశమైనా ప్రజల విశేష ప్రజ్ఞనుబట్టే గొప్పదౌతుంది.

సాంకేతిక విజ్ఞానం దృష్ట్యా చూస్తే మనదేశం వేసినచోటే ఉన్నట్లు ఉండి అని శ్రీ నెహ్రూ అన్నారు. మనదేశం అభివృద్ధి చివరికి పరిశోధనాలయాలలో మన యువతీ యువకులు సాధించే విజ్ఞానశాస్త్రాభివృద్ధిపై ఆధారపడి ఉంటుందన్నారు.

ప్రభుత్వం నిర్వహించే నిర్మాణ కార్యక్రమాల్లో ఉత్సాహం, ఆసక్తి కావలసినంత లేదని అందరూ ఆరోపిస్తున్నారన్నారు. ప్రభుత్వోద్యోగుల దృక్పథం కూడా మారాలన్నారు. వారు వారి పనుల్లో ఆసక్తి, దీక్ష చూపడం అవసరం. ప్రపంచంలో వస్తున్న సాంకేతిక విజ్ఞాన విప్లవంలో మనదేశం వెనుకబడిపోకుండా శ్రద్ధవహించవలసిన బాధ్యత విద్యార్థులు, శాస్త్రజ్ఞులు, ప్రభుత్వోద్యోగులపై ఉన్నదన్నారు.

రష్యా అమెరికాలలో రాజకీయంగా పోలికలేని వ్యవస్థలున్నా, రెండు దేశాలలోనూ సాంకేతిక విజ్ఞానాభివృద్ధిలో ఒకే పోలికలున్నాయన్నారు. రెండూ ఒకేదిక్కుగా పురోగమిస్తున్నాయి. ఈ ప్రపంచంలో భారతదేశం వెనుకబడిపోతున్నట్లు భయం కలుగుతోంది. మనదేశంలో శాస్త్రవిజ్ఞానాభివృద్ధి, సాంకేతిక శిక్షణల విషయంలో పాతపోకడలు పోవాలన్నారు.

ప్రణాళికలు ఎంత బాగా తయారుచేసినా నిర్వహించగల సాంకేతిక సామర్థ్యం లేకపోతే అవన్నీ వ్యర్థమే అన్నారు.

ఈ రోజుల్లో ప్రభుత్వోద్యోగి తన గదిలో కుర్చీలో కూచుని అందరికీ ఆజ్ఞలిస్తూ వుంటాడు. ఇంజనీర్లకి, సాంకేతిక నిపుణులకి కూడా ఈ ఉద్యోగి ఆజ్ఞలిస్తాడు. ఇదంతా పాత పద్ధతి. ఈపద్ధతి పోవాలని శ్రీ నెహ్రూ అన్నారు. ప్రభుత్వోద్యోగి ప్రతి ఒక్కడూ సాంకేతిక విద్యలోనో మరో విద్యలోనో నిపుణుడై ఉండే రోజులు రాగలవని శ్రీ నెహ్రూ అన్నారు.

భారతదేశంలో ఎన్నెన్నో ప్రభుత్వాలు నిర్వహించే కార్యక్రమాలున్నాయి. ఈ అన్నిటినీ ఎవరు నిర్వహిస్తారు? దేశంలో చాలినంత మంచి నిపుణులు లేరు. లక్షలకొద్దీ నిపుణులు ఈనాడు అవసరం. అతి త్వరలో నిపుణులు తయారుకాని పక్షంలో మనదేశం వెనుకబడిపోక తప్పదని శ్రీ నెహ్రూ అన్నారు.

### రాష్ట్రంలో పంటలు

కర్నూలు, ఏప్రిల్ 14: రాష్ట్రంలో ప్రస్తుతం చేలల్లో ఉన్న పంటలన్నీ బాగా సేటున్నవి. ప్రస్తుత పంటల పరిస్థితిపై ప్రభుత్వంచేసిన ప్రకటనలో ఇట్లా ఉన్నది.

# హైదరాబాదు పంచాయతీలు

## ఇకనుంచి న్యాయ విచారణ అధికారం

హైదరాబాదు, ఏప్రిల్ 14: హైదరాబాదు రాష్ట్రంలో ఇకముందు ఏర్పడనున్న గ్రామ పంచాయతీలకు చిన్న చిన్న సివిల్ క్రిమినల్ తగాదాలను పరిష్కరించే అధికారాలుంటవని స్థానిక పరిపాలనాశాఖ మంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే యీ శాసనసభలో చెప్పారు. ఇందుకు అవసరమైన అంశాలను హైదరాబాదు గ్రామ పంచాయతీల చట్టంలో చేర్చామని కూడా వివరించారు.

హైదరాబాద్ గ్రామ పంచాయతీల బిల్లు మొదటి పరిశీలన సందర్భంలో ప్రసంగించుతూ మంత్రి పైవిషయం చెప్పారు. ఇంకా యిట్లా వివరించారు: "జాతీయాభివృద్ధి ప్రణాళిక ననుసరించి జరిగే గ్రామాభివృద్ధి పనులను అమలు జరిపే అధికారం ఈ బిల్లువల్ల గ్రామ పంచాయతీలకు లభించుతుంది. ఆ విధంగా జాతీయాభివృద్ధి ప్రణాళికల పనులు జరిపే విషయంలో గ్రామాల్లోని ప్రజల సహకార సహాయాలను సమకూర్చుకొనడం జరుగుతుంది".

"ఈ బిల్లు ప్రకారం వెయ్యి అంతకంటే యెక్కువ జనాభాగల ప్రతి గ్రామానికి లేదా కొన్ని గ్రామాలను కలిపి గ్రామ సభను ఏర్పాటు చేస్తారు. గ్రామ సభ ఏడాదికి కనీసం రెండుసార్లయినా సమావేశమై పంచాయతీ బోర్డు ఆయవ్యయాల నివేదిక, పరిపాలనా నిర్వహణ సమీక్షలను పరిశీలించి చేయవలసిన పనులను నిర్ణయిస్తుంది".

ప్రస్తుతం అమల్లో ఉన్న గ్రామ పంచాయతీ సభ్యుల నియామక పద్ధతిని పూర్తిగా రద్దు చేశారు.

చిన్న చిన్న సివిల్, క్రిమినల్ తగాదాలను పరిష్కరించే న్యాయ పంచాయతీలకు రెవెన్యూ వ్యవహారాలలో కొన్నింటిని పరిష్కరించే అధికారంకూడా ఉంటుంది.

కిందటి జూన్‌లో సిమ్లాలో జరిగిన స్థానిక పరిపాలనాశాఖ మంత్రుల సమావేశం నిర్ణయం ప్రకారం గ్రామ పంచాయతీలపై పర్యవేక్షణాధికారం జిల్లాబోర్డులకు ఉంటుందని, తన అధికారాలలో కొన్నింటిని, కొన్ని బాధ్యతలను గ్రామ పంచాయతీలకు మార్చే వీలు జిల్లాబోర్డులకు ఉన్నదని మంత్రి చెప్పారు.

గ్రామంలో వసూలయ్యే సిస్తులో 100-కి 15 గ్రామ పంచాయతీకి ప్రభుత్వం ఇస్తారు. ఇదికాక స్థానికంగా వసూలయ్యే సెస్సులో సగానికి తక్కువగాని మొత్తంకూడా గ్రామ పంచాయతీకి ఇస్తారు.

గ్రామీణ వ్యవహారాలకు సంబంధించినంతవరకు నిజమైన స్వయంపరిపాలనా నిర్వహణ వ్యవస్థలుగా గ్రామ పంచాయతీలను రూపొందించడానికి వీలుగా బంజరు భూములు, పచ్చికబీళ్లు, అడవుల సమీప ప్రదేశాలపై గ్రామపంచాయతీలకు అధికారం లభించే యేర్పాట్లు బిల్లులో ఉన్నవని శ్రీ గోపాలరావు ఎక్బోటే చెప్పారు. భూమిసిస్తు వసూలుపని, భూమి వ్యవహారాల లెక్కలపని, ఇంతవరకు సాగుకాకుండా వున్న బంజర్లవంటి భూములను సాగుచేయించడంవంటి పనులు గ్రామపంచాయతీలకు ఒప్పగించడం వచ్చునని కూడా బిల్లులో ఉన్నది.

హైదరాబాద్ కౌలుదారీ, వ్యవసాయభూముల చట్టంప్రకారం కొంతమంది రెవెన్యూ అధికారులకు లభించే అధికారాలను గ్రామ పంచాయతీలు చెలాయించే అవకాశం బిల్లులో ఉన్నది. 'వతందారీ' విధానాన్ని క్రమంగా రద్దుచేసే ఏర్పాటు బిల్లులో ఉన్నదనికూడా శ్రీ ఎక్బోటే చెప్పారు. ఆ తరువాత బిల్లు మొదటి పరిశీలన పూర్తి అయింది.

# మంత్రివర్గాన్ని నిందించడం బాధ్యతగల పని కాదు

## వెనకటి మంత్రివర్గమే మంచిదని ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుని మాట

బందరు, ఏప్రిల్ 10: "బళ్ళారి మొదలకు ఆంధ్ర ప్రాంతాలు పోగొట్టుకోవడానికి అతుకులబొంత మంత్రివర్గమే కారణమని ఒకానొక మంత్రి నిందించడం బాధ్యతలేని పని. ఇది శుద్ధ అబద్ధం. ఆయన మంత్రివర్గంలో చేరిన తర్వాతే అది అతుకులబొంత అయిందేమోగాని అంతకుముందు మాత్రం కాదు. మంత్రివర్గం, ప్రతిపక్షాలు కూడా బళ్ళారి విషయమై గట్టి కృషి చేశాయి. ఇంకా కొన్నిటి కోరకు న్యాయమైన ఆందోళన కూడా జరుగుతోంది" అని ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు నిన్న రిమ గౌరవార్థం పురపాలక సంఘ విహారవనంలో జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ అన్నారు. ప్రస్తుత మంత్రివర్గం కంటే ప్రకాశం మంత్రివర్గమే మేలని కూడా శ్రీ రాజు అన్నారు. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య అధ్యక్షత వహించారు.

పట్టణ, తాలూకా, తూర్పు కృష్ణా కాంగ్రెసు సంఘాలు, యువజన, మోటారు యూనియన్ కాంగ్రెసు సంస్థలు, తదితర ప్రజాసంస్థలు సన్మానపత్రాలు సమర్పించాయి.

### దేవుడున్నాడు

సన్మానపత్రాలకు సమాధానమిస్తూ శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు యిలా అన్నారు. "విశాలాంధ్ర సాధన విషయంలో రాయబారాలకై నాకు ప్రదేశ్ కాంగ్రెసు, శాసన సభా ఐక్య కాంగ్రెసు సంపూర్ణ సహకారం యిచ్చాయి. నాశక్తి విజయవంతంగా నిర్వహించాను. ఇది వరకు దైవంపై నాకు నమ్మకం లేదు. కాని దీనితో విశ్వాసం కుదిరింది. ఈ విశాలాంధ్ర సమస్యాపరిష్కారంలో అనేక చిక్కులెదుర్కొన్నాం."

'ఒక చిక్కు ఏమిటంటే' ఒక కాంగ్రెసు అగ్రనాయకుడు ఒకానొక కాంగ్రెసు ప్రముఖునిని వేదికపై ఆధారపడి మనకు వ్యతిరేకమైన ఖరి వహించడం అన్నిటికంటె విచిత్రమైనది రంగాగారి పాత్ర! రాజ్యసభలో వీరి వుపన్యాసం విని ఆంధ్రాభిమానులే పార్లమెంటులో ఖండించారు. ఇవన్నీ యిలా వుండగా యీ మధ్య మంత్రివర్గంలో చేరిన ఒకాయన బళ్లారి పోవడానికి అతుకులబొంత మంత్రివర్గమే కారణమని ఆరోపించారు.

ఇది శుద్ధ అబద్ధం. ఆయన చేరాక అలా అయిందేమోగాని అంతకుముందు మాత్రం కాదు. ఇలా అనడం బాధ్యతారహితం."

"విశాలాంధ్ర నిర్ణయము యొక్క తెలంగాణా నాయకులు కూడా తమ వైఖరి మార్చుకుని సహకరించారు. వారికి హామీలు, వాగ్దానాలు యిస్తున్నాం. సర్కారు జిల్లాలపట్ల వారికిగల భయాలను పోగొట్టే బాధ్యత మనదే.

"దేశంలో సోషలిస్టు సమాజంలో ప్రవేశించవలసి వున్నది. పారిశ్రామిక విప్లవం ప్రారంభమైంది. నదిజలాల ప్రక్రమ వినియోగానికి మన రాష్ట్ర ఇంజనీర్లు చక్కని పథకాలు రూపొందిస్తున్నారు."

శ్రీ వంకాయల శ్రీనివాసరావు మాట్లాడుతూ దేశ పునర్నిర్మాణ కార్యకలాపాలలో ప్రజలు ఎక్కువగా పాల్గొనాలని కోరారు. శ్రీ చిన్నకోట ధర్మారావు వందనసమర్పణ చేశారు.

### వెనుకటి మంత్రివర్గమే మేలు

ఈ ఉదయం పురపాలక సంఘం శ్రీ రాజాన్ను సన్మానించింది. శ్రీ రాజు సన్మానపత్రానికి సమాధానమిస్తూ యిలా చెప్పారు: "బందరు పట్టణం అఖిలభారత ఖ్యాతిగాంచిన శ్రీ పట్టాభి వంటి నాయకులకు జన్మస్థలం. ముట్నూరి కృష్ణారావుగారు రాజకీయవేత్తగా, ప్రభుత్వ రచయితగా, తమ ప్రజ్ఞా విశేషాలు వెల్లడించారు. వారి పేర భూరగాయల, పండ్ల, మార్కెట్‌ను పురపాలకసంఘం నిర్మించడం, దానికి నేను ప్రారంభం చేయడం, అదృష్టం. శ్రీ కొల్లిపర వెంకటరమణయ్యనాయుడు పేర పార్కు నిర్మించడం వారిపట్ల మీకు గల అదరాభిమానాలు వెల్లడిచేస్తోంది."

"నేటి శాసనసభలో ప్రభుత్వానికి అత్యంత సంఖ్యాబలం వున్నా అభివృద్ధి కార్యక్రమాలు, భూ సంస్కరణలవంటివి త్వరగా చేయలేకపోతోంది. దినదినగండంగా 13 మాసాలు అధికారంలోవున్న ప్రకాశంగారి మంత్రివర్గమే అన్ని అడ్డంకులను త్రోసిపుచ్చి, ఎన్నో మంచిపనులు చేసింది. భూ సంస్కరణలగురించి ప్రశ్నావళిని ముఖ్యమంత్రి పార్టీ సమావేశంలో చర్చకు పెడదానికి బదులు 196 మందికి పంపితే 11 మంది మాత్రం యిప్పటికి సమాధానమిచ్చారు. ఇక ప్రజాస్వామ్యం ఎలా నెగ్గుతుంది? శాసన సభ్యులపై ప్రజలు శ్రద్ధ వహించాలి."

శ్రీ కె. నరసింహారావు వందన సమర్పించారు.

# చీరాలకు విద్యుచ్ఛక్తి మంత్రి రాక

## పట్టణ పశ్చిమభాగంలో దీపాల అవసరం

చీరాల, ఏప్రిల్ 8: విద్యుచ్ఛక్తి శాఖమంత్రి శ్రీ గౌతు లచ్చన్న నిన్న వచ్చారు. పురపాలక సంఘాధ్యక్షుడు హరిప్రసాదరావుపంతులు సన్మానపత్రం సమర్పించారు. చీరాల పశ్చిమభాగంలో యింకా విద్యుద్దీపాలు అమర్చలేదనీ వృధాగా ఆలస్యం జరుగుతున్నదనీ, సత్వరచర్య తీసుకోవాలనీ కోరారు.

తనకు ఉద్యోగులనుంచి ఈ విషయమై జవాబురాగానే సత్వరంచర్య తీసుకొంటానని మంత్రి చెప్పారు.

శ్రీ ఆర్. దేవేంద్రనాథం వందన సమర్పణ చేశారు. స్వ. వి

# చిత్తూరుకు స్థానికసంస్థల మంత్రి రాక

చిత్తూరు, ఏప్రిల్ 13: కర్నూలు నుంచి తిరపతివెళ్తూ స్థానిక పరిపాలనాశాఖమంత్రి డాక్టరు ఎ. బి. నాగేశ్వరరావుగారు వచ్చారు. జిల్లాకలెక్టరు శ్రీ యాగంటి, డెప్యూటీ పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ ఓబులరెడ్డి, పురపాలకసంఘాధ్యక్షుడు శ్రీ గురప్పనాయుడు, ఉపాధ్యక్షుడు శ్రీ లోకనాథ ఆచారి, శ్రీయుతులు డి. శ్రీనివాస అయ్యంగార్, వంగ్రాలాయనాయుడు, రాజగోపాల్ నాయుడు మొదలైనవారు స్వాగతమిచ్చారు.

జిల్లాబోర్డు యాజమాన్యాన పని చేస్తున్న ఉపాధ్యాయుల జీతాలసంగతి మంత్రికి శ్రీ యాగంటి చెప్పారు.

పురపాలకసంఘం అధ్యక్షుడు, కమీషనర్లపై కొన్ని ఆరోపణలు చేస్తూ ఒక రాయబారివర్గం మంత్రికి ఒక విజ్ఞప్తి సమర్పించారు. 8 మంది పురపాలక సంఘసభ్యులు విజ్ఞప్తిపై సంతకాలు చేశారు. స్థానికసంస్థల ఇన్‌స్పెక్టర్ జనరల్‌ను సంప్రదించి తగిన చర్య తీసుకుంటామని మంత్రి సమాధానమిచ్చారట.

ఆ తరువాత పురపాలకసంఘం అధ్యక్షుడ్నీ, కమీషనరును పిలిపించి మంత్రి మాట్లాడారు. జిల్లాబోర్డు పురపాలక సంఘాల ఆర్థిక విషయాలనుకూడా ప్రత్యేకాధికారితోను, కమీషనరుతోను మంత్రి మాట్లాడారు.

# ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ విద్యార్థులకు వీడ్కోలు

కొవ్వూరు, ఏప్రిల్ 9: ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠములో భాషా ప్రవీణ (ఫైనల్) పరీక్ష యిచ్చినవారికి అధ్యాపకులు మొన్న వీడ్కోలు సభ జరిపారు. సభకు విద్యాపీఠ కార్యదర్శి శ్రీమాన్ ప్రగడ శ్రీరాములు అధ్యక్షత వహించారు. కళాశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ శేషరాజు వెంకటసుబ్బయ్య అన్నారు... విద్యాపీఠ స్థాపన నాటి కాలం నుండి విద్యాపీఠం ఏ విధంగా పనిచేస్తున్నదీ వివరించారు.

శ్రీ వింజంపల్లి రాజగోపాలరావు ప్రస్తుత విద్యావిధానమును విమర్శిస్తూ సంస్కృత భాషా ప్రాశస్త్యాన్ని, గురుకులాల నిశ్చితి వివరించారు. విద్యార్థులు తమ విద్య ముగియడం వల్ల చేతులెత్తి ఊరుకోక నేర్చుకున్న విద్యను ఉపయోగించుకోవాలని, మాతృ సంస్థకు కీర్తి తెచ్చేవారుగా మెలగాలని హితబోధ చేశారు. ప్రాచ్య కళాశాలాధ్యాపకులు శ్రీ కందుకూరి ఎర్రనశాస్త్రి, శ్రీ ఖాదిపాటి రామచంద్రశాస్త్రి ప్రసంగించారు.

# దక్షిణ భారత్ హిందీ ప్రచారసభ

మద్రాసు, ఏప్రిల్ 15: దక్షిణ భారత్ హిందీ ప్రచారసభ అధ్వర్యాన 1956 ఫిబ్రవరిలో జరిగిన రాష్ట్రభాషా ప్రవీణ పరీక్షలలో కృతార్థులైన అభ్యర్థుల రిజిస్టరు నంబర్ల వివరాలివి:

## మొదటిపార్ట్-ప్రాచీన్‌పద్య

5 15 24 39 43 52 57 62 66 టు 70 79 124 25 26 30 టు 33 35 టు 39 41 42 43 46 48 49 50 52 65 85 86 88 89 91 92 94 96 97 99 201 06 14 టు 17 19 టు 25 27 టు 34 37 38 40 టు 44 46 47 51 80 82 టు 91 329 32 39 42 62 90 94 404 09 11 26 30 31 38 40 43 44 59 65 75 76 88 టు 89 97 98 500 టు 05 07 టు 17 19 21 22 25 28 30 టు 34 48 54 57 76 78 టు 81 97 600 01 02 04 24 27 28 38 42 43 53 54 60 68 74 76 79 81 82 87 88 93 701 02 18 25 36 76 77 78 84 86 87 806 20 33 38 41 59 74 75 906 27 టు 37 39 40 43 45 46 49 53 54 55 57 58 63 64 65 67 89 1010 11 19 26 52 57 టు 60 63 65.

## రెండవపార్టు ఆదునిక పద్య

5 11 25 28 37 39 44 46 48 57 58 63 68 79 84 92 96 105 25 28 32 37 40 41 42 44 46 58 57 63 94 200 15 16 18 19 21 24 27 30 31 38 44 54 68 80 81 83 టు 92 97 98 302 8 11 27 28 39 40 49 టు 54 57 58 81 85 88 92 95 401 10 12 28 34 48 62 66 77 78 79 90 91 92 95 97 501 8 10 13 37 39 40 49 50 57 65 83 87 97 600 1 12 14 51 63 97 99 702 4 7 35 43 44 54 55 57 61 63 67 69 72 74 75 86 94 816 49 50 55 58 64 65 68 70 74 76 80 99 906 8 9 11 12 13 15 16 17 19 35 37 42 43 44 48 52 57 58 60 61 63 79 87 93 96 97 1001 26 32 43 52 54 56 57 60 63 64 66.

## మూడవపార్టు-హిందూస్తానీ సాహిత్య

6 9 24 25 27 28 29 36 39 45 62 67 టు 70 72 73 79 96 101 3 5 9 13 14 22 23 24 26 27 29 33 35 37 38 41 టు 46 48 టు 52 57 58 60 66 67 85 88 89 91 టు 96 99 201 3 11 14 టు 17 19 టు 25 29 30 32 టు 36 38 40 టు 43 47 49 60 64 68 69 74 99 302 5 16 17 18 21 24 27 31 35 36 39 63 64 66 75 401 9 10 11 37 51 54 55 56 82 97 98 99 503 4 6 టు 9 11 టు 17 20 టు 24 26 28 30 టు 33 40 57 59 72 77 79 84 85 94 95 98 609 14 19 20 31 53 57 61 69 83 88 92 95 708 11 14 22 23 36 44 48 51 52 65 71 76 77 80 81 91 803 5 12 13 23 25 27 28 40 41 55 66 68 74 75 77 82 83 91 918 31 టు 47 49 టు 56 58 60 టు 67 69 74 89 1000 9 10 14 15 17 టు 23 26 31 35 52 54 57 టు 60 70.

## నాలుగవ పార్టు - ప్రాదేశిక భాష

2 3 5 7 14 39 50 56 75 86 104 24 25 26 32 39 56 74 83 208 17 19 36 54 67 94 338 39 44 46 47 56 67 68 76 77 94 404 టు 08 13 14 19 22 30 31 38 39 47 53 61 64 73 75 81 83 టు 89 510 32 47 59 60 64 72 78 89 93 97 601 07 11 25 27 28 36 38 41 76 77 81 82 93 98 701 02 03 05 06 07 13 20 27 28 32 41 45 48 79 81 84 87 93 97 803 04 05 08 12 22 24 30 31 33 టు 38 40 45 46 54 73 79 89 90 94 908 టు 14 21 22 57 60 68 70 77 78 80 82 87 95 1002 12 16 20 టు 23 26 34 43 45 47 54 56 63 64 65 69.

## అయిదవపార్టు-సమాజ విజ్ఞానం

8 19 28 34 38 65 68 69 70 85 108 10 24 25 26 28 30 31 34 35 36 38 39 41 42 44 46 48 49 51 52 68 81 85 88 89 91 92 94 96 97 99 200 01 04 07 13 14 15 17 టు 22 24 టు 30 32 34 35 38 39 42 43 44 47 61 70 77 81 95 311 15 16 28 38 39 48 76 78 88 417 48 54 71 82 95 97 99 టు 511 13 టు 19 21 22 24 టు 28 30 టు 33 36 65 73 75 85 86 98 95 96 600 08 19 20 29 35 53 93 99 700 10 15 20 27 32 33 36 45 51 65 76 89 93 804 05 08 12 16 18 22 24 49 61 76 81 91 915 20 23 24 27 28 29 31 టు 43 45 టు 69 75 80 82 89 1000 08 19 24 27 31 46 47 48 51 52 54 56 57 59 61 63.

## ఆరవపార్టు-భాషావిజ్ఞానం

1 5 6 15 20 22 29 42 48 52 56 61 68 74 83 84 85 87 91 94 95 103 8 10 14 15 17 20 30 40 42 43 44 57 60 75 76 85 92 94 95 97 202 9 27 28 31 36 59 68 72 93 305 7 26 28 36 37 39 40 44 45 47 49 టు 54 56 57 67 71 73 86 98 401 18 19 24 39 43 55 57 60 61 66 70 77 టు 80 90 టు 94 96 99 504 6 10 12 17 26 27 33 34 39 47 53 62 71 73 78 91 94 600 2 16 17 40 43 62 69 70 80 39 712 18 25 27 30 29 43 47 51 55 61 62 63 72 టు 75 77 95 98 800 2 12 13 20 22 35 42 45 54 55 57 58 77 80 83 84 88 99 902 3 16 20 25 69 71 72 77 75 81 83 88 93 94 96 97 98 1000 7 9 11 15 19 26 28 32 46 49 53 57 56 63 64 66.

మధ్యమ, ప్రవేశిక, ప్రాథమిక పరీక్షల ఫలితాలు ఈనెల 17, 18, 19 తేదీలలో ప్రకటిస్తారు.

# శ్రీ రంగారావు సంఘ పర్యటన

## వెనుకపడిన జాతుల స్థితి విచారణకు

మద్రాసు, ఏప్రిల్ 10: షెడ్యూలు జాతులు వెనుకబడ్డ జాతులు నేరస్థ జాతుల స్థితిగతులను వృద్ధిచేయటానికి గల అవకాశాలను విచారణచేసి ఆంధ్ర ప్రభుత్వానికి తగు సిఫారసులు చేయడానికి నియమితమైన విచారణసంఘం యీ క్రింది కార్యక్రమం ప్రకారం పర్యటన చేస్తుంది.

ఆంధ్ర విద్యాశాఖ డైరెక్టరు శ్రీ జి. రంగరావు నాయుడు యీ సంఘానికి అధ్యక్షుడు.

ఏప్రిల్ 16 మధ్యాహ్నం 2 గంటలకు మద్రాసులో సమావేశం. 17 ఉదయం 7-35కు బొంబాయి ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరి మధ్యాహ్నం 12-13 కు కాళహస్తి. (ములామార్ ఏనాదికాలనీ దర్శనం) 18 ఉదయం 8 నుంచి 10 వరకు విజ్ఞాపనల స్వీకరణ. మధ్యాహ్నం 3-23 కు కాళహస్తినుంచి బయల్దేరి రాత్రి 8-57 కి చిత్తూరు. 19 ఉదయం 8 నుంచి 10 వరకు బయల్దేరి సాయంత్రం 5 కు మదనపల్లి. 20 ఉదయం 8 నుంచి 10 వరకూ విజ్ఞాపనలు. కుగాలీల స్థలాల సందర్శనం మధ్యాహ్నం 12-25 విజ్ఞాపనల స్వీకారం. మధ్యాహ్నం 2.0 గం.లకు బయల్దేరి సాయంత్రం 6-40 కు ధర్మవరం. 21 ఉదయం 8 నుంచి 10 వరకు విజ్ఞాపనలు. మధ్యాహ్నం 2 కు బయల్దేరి సాయంత్రం 4 కు అనంతపురం. 22 న అనంతపురం నుంచి కర్నూలు. 28 న పిడ్డాపురం సెటిల్మెంటు.

# భూమి సంస్కరణలు

## కాంగ్రెసు ప్రభుత్వ శ్రద్ధ

కర్నూలు, ఏప్రిల్ 14: భూమి సంస్కరణల చట్టం వీలైనంత త్వరగా అమల్లోకి రావాలని కాంగ్రెసుపార్టీ కోరుతున్నదని కుడిమెట్ట గ్రామంలో నిన్న సాయంకాలం జరిగిన రైతుసభకు అధ్యక్షత వహించుతూ శాసనసభా ఐక్య కాంగ్రెసు పక్షపు సచేతకుడు శ్రీ పి. రంగారెడ్డి అన్నారు.

"గొప్పపదవులలో ఉన్నవారి వ్యక్తిగతాభిప్రాయాలేమైనప్పటికీ భూమి సంస్కరణలు అమలులోకి రాక తప్పదు. ఇక ఏమాత్రం ఆలస్యం జరిగినా సోషలిస్టు సమాజ వ్యవస్థాపనాశయానికి చెరుపు కలుగుతుంది" అని కూడా శ్రీ రంగారెడ్డి అన్నారు. రెండవ పంచవర్ష ప్రణాళిక పనులను సఫలం చేయడానికి కృషిచేయమని రైతులకు సలహా చెప్పారు.

ఆ గ్రామంలోని చెరువుకు నీరు సప్లయి చేసే కుంటకాలువకు తూములు పెట్టించవలసిన అవసరం వివరించుతూ పంచాయతీ బోర్డు అధ్యక్షుడు శ్రీ రోశిరెడ్డి ప్రసంగించారు. శ్రీయుతులు జి. ఆదినారాయణరెడ్డి, ఆచారిగారలు కూడా మాట్లాడారు. శ్రీ పోలిరెడ్డి వందన సమర్పణ చేశారు.

# తంతి తపాలా సిబ్బంది రాజమండ్రి సంఘం

రాజమండ్రి, ఏప్రిల్ 10: అఖిల భారత తపాలాశాఖ మూడవతరగతి ఉద్యోగుల సంఘం రాజమండ్రి శాఖ అధ్వర్యాన, మొన్న తంతితపాలా శాఖ చెర్యరు ఉద్యోగుల సమావేశం శ్రీ గౌతమీ గ్రంథాలయ ఆవరణలో శ్రీ. ఎస్. మహాదేవయ్య అధ్యక్షతన జరిగింది. అంధ్రశాఖ కార్యదర్శి శ్రీ వి. ఆర్. మోహనరావుకూడా పాల్గొన్నారు.

తంతి తపాలాశాఖ ఉద్యోగుల జాతీయ సంఘంవారు రూపొందించిన కోర్కెల ప్రణాళికలోని 30 అంశాలను స్వల్ప సవరణలతో ఆమోదిస్తూ తీర్మానించారు.

స్థానికశాఖా కార్యదర్శి శ్రీ వడ్డాది వెంకటరావు వందనసమర్పణ చేశారు. (స్వ. వి.)

# లంకభూములు: వ్యవసాయ కూలీలు

రేపల్లె, ఏప్రిల్ 9: కొక్కిలగడ్డ శివారు గ్రామముల వ్యవసాయకూలీ సహకారసంఘ సభ్యులు ఆ ప్రాంతము లోని ఇతర కూలీలు 4వ తేదీన శ్రీ ముత్తి హనుమంతరావు అధ్యక్షతన సమావేశమై లంకభూములలో మూడవవంతు పచ్చికబయళ్లకు వదలి మిగతావి మార్కెటు రేటుకు సొసైటీలకు ఇవ్వాలని ఇటీవల ఆంధ్రప్రభుత్వం చేసిన వుత్తర్వులకు తమ వ్యతిరేకతను తెల్పుతూ లంకభూములను మామూలు ప్రకారమే కార్మికసంఘాలకు ఇప్పించవలసినదిగా కోరుతూ తీర్మానించారు.

